Deergakalika Praja Udyamam

ankalla prudhviraj

"If we tried to go on the offensive when the masses are not yet awakened, that would be adventurism. If we insisted on leading the masses to do anything against their will, we would certainly fail. If we did not advance when the masses demand advance, that would be Right opportunism"

**- MAO TSE TUNG**

*Dharani Publications*

# దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం

అంకాళ్ళ పృథ్వీరాజ్



ధరణి ప్రచురణలు

"NO ONE IS MORE HATED THAN HE WHO SPEAKS THE TRUTH"

..... PLATO

# అంకితం

విప్లవోద్యమ గానాన్ని
ప్రవృత్తిగా మలుచుకున్న
**'డప్పు' రమేష్ అన్నకు...**

మరియు

దళిత సమస్య పరిష్కారం విప్లవోద్యమంలో
భాగమని తుదకంటా భావించిన
**ఉబ్బా కోటిలింగారావు గారికి (తాతయ్య) ...**

# దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం

## I

కార్మికవర్గ దృక్పథం తప్ప ఏ వర్గ దృక్పథమైనా అనివార్యంగా భ్రమాత్మక చైతన్య ప్రతిఫలనమని మనం అవగాహన చేసుకోవాలి, మానవుని కార్యాచరణలోని పరిమితిపర పాదార్థిక సంబంధ విధానము యొక్క శ్రమ విభజన మరియు పరిమితి కలిగిన సామాజిక సంబంధాల నుండి ఏర్పడే మానవుని చైతన్యం అనివార్యంగా తలక్రిందులుగా ఊహించడాన్ని మనం భ్రమాత్మక చైతన్యంగా చెప్పుకుంటాము. అయితే కార్మికవర్గ దృక్పథం భౌతికవాద గతితర్కం, ఈ తాత్త్విక నేపథ్యంగా సమాజాన్ని దాని చలన నియమాలను అవగాహన చేసుకోవడం జరుగుతుంది. భౌతికవాద గతితర్కం వాస్తవ చైతన్యం, వాస్తవ చైతన్యం అనేది మరీ ముఖ్యంగా మానవుని అస్తిత్వాన్ని నిర్ణయించే ఉత్పత్తి సంబంధాలను మనం పునాదిగా వ్యవహరిస్తాము, ఈ పునాది ఉపరితలం ఏర్పడటానికి కీలకంగా ఉంటుంది. నిజానికి దీనిని అనుమేయంగా (ఊహింపదగినదిగా

చెప్పుకోవాలి) అర్థం చేసుకోవాలి, అయితే ఖచ్చితంగా అన్వయ నియమంగా అని గ్రహించాలి అనగా సాధనమునకు సాధ్యమునకు గల నియతి సంబంధంగా ఉద్భవిస్తుంది. ఈ పునాది ప్రతిఫల ఉ పరితలంగా ఈ ఉపరితలపు వివిధ భావజాల సంస్థలు-భావజాల సంబంధాలు-భావజాలాల క్రమ పరిణామ ప్రక్రియపు ప్రతిఫల చైతన్యాన్ని మనం మానవుని వాస్తవ చైతన్యంగా గ్రహించవచ్చు, భౌతికవాద గతితర్కం వాస్తవ చైతన్య ప్రతిఫలనం.

ఈ తాత్విక నేపథ్యంగా ఏ శాస్త్రానికైనా దాని ప్రత్యేకత యొక్క సాధారణీకరణ స్వభావం అనివార్యంగానే అమూర్తీకరణ భావనగా, ఆ భావననే శాస్త్రాంశముగా చలామణి అయ్యే స్థితి కలిగినదిగా అవగాహన చేసుకోవాలి. ఆ విధంగానే కమ్యూనిస్టు పార్టీ విషయంలో సైతం శాస్త్రాంశమును కూడా గమనిస్తే దాని ప్రత్యేకతల విషయంలోనైనా దాని ఆచరణను సాధారణీకరణ యొక్క అమూర్తీకరణ భావనల యొక్క సారం నుండే శాస్త్రాంశములో భాగమై చలామణి అయ్యేదిగా అవగాహన చేసుకోవాలి. అందుకే అమూర్తీకరణ అనేది ప్రామాణికమైన అంశంగా చూడాల్సిన అవసరం ఉంటుంది. ఇకపోతే కమ్యూనిస్టు పార్టీకి ప్రజాసంఘాల ఆచరణపై నిర్దిష్టమైన అవగాహన కలిగియున్న చరిత్ర మనకు తెలుసు. భారత విప్లవోద్యమం యొక్క కొనసాగింపుగా కమ్యూనిస్టు పార్టీ ఆచరణను గమనించాలి. ఈ మొత్తం విప్లవోద్యమంలోని విరుద్ధాంశాల ఐక్యత-ఘర్షణలలో భాగంగానే విప్లవ పార్టీ యొక్క ఏర్పాటుకు తగిన భౌతిక వాస్తవికమైన

వైరుధ్య పరిస్థితులు-కారణ-కార్యాలు అనివార్యంగా వైషమ్య స్థాయిలోకి పరిణమించిన స్థితిలోనే రివిజనిజం-ఆధునిక రివిజనిజంతో తెగతెంపులు చేసుకుని విప్లవ కమ్యూనిస్టులుగా పరిణమించడం జరిగింది. ఆచరణ యొక్క మౌళిక స్వభావంలో రివిజనిజం-ఆధునిక రివిజనిజాలపై తిరుగుబాటు చేసి మార్క్సిస్టు-లెనినిస్టు-మావోయిస్టు రాజకీయాచరణను అమలుచేస్తున్న ఏకైక పార్టీగా నిలబడిన చరిత్ర విప్లవ కమ్యూనిస్టులకు ఉన్నది. అయితే ఈ ఆచరణ యొక్క పార్శ్వాలైన సైద్ధాంతిక స్థాయిలోనూ దాని ఆచరణాత్మక స్థితిలోనూ రివిజనిజంతో తెగతెంపులు చేసుకునే కర్తవ్యం పరిపూర్తి అయిపోయినదనే నిర్ధారణతో సాగడం అనేది పిడివాదమని అవగాహన చేసుకోవాలి. అందుకే రివిజనిజం అనేది కేవలం ఒక భావజాలాత్మక సమస్య కాదు, అది ఆచరణ తాలూకు భౌతిక వాస్తవం. ఈనాడు వివిధ కమ్యూనిస్టు పార్టీలు వాటి ప్రజాసంఘాల సైద్ధాంతిక ఆచరణాత్మకతలోని లోపాలు అనేవి రివిజనిస్టు మానిఫెస్టేషన్స్ యొక్క ప్రతిఫలనాలు. ఈ రివిజనిజంపై పోరాటం అత్యంత గంభీరంగా అడపాదడపా జరుగుతూనే ఉన్నాయి, ఈ పోరాటాన్ని నిర్వహిస్తున్న క్యాడర్ పై అత్యంత దూకుడుగా దాడులు నిర్వహిస్తూ వారందరిని విప్లవానికి-విప్లవోద్యమానికి దూరం చేసే కుట్రలు జరిగాయి-జరుగుతూనే ఉన్నాయి. అందుకే ఎప్పటికప్పుడు ఆత్మవిమర్శలోకి మనల్ని మనం గురి చేసుకుంటే ఆచరణలో విప్లవ కమ్యూనిస్టులుగా మారడం జరుగుతుంది లేదంటే దిగజారిపోవడం కాయము. ఆ ఉద్దేశంతోనే

నేడు మనం ఈ దీర్ఘకాలిక ప్రజా ఉద్యమ పోరాటాన్ని ప్రారంభించడం జరుగుతుంది. మనం ఈ కాలం మంతటిలోనూ గడించిన అనుభవాలు మనల్ని మరింతగా సిద్ధాంతపు అభివృద్ధివైపుకు తీసుకుపోయిన పరిస్థితిని వ్యక్తం చేయడమే లక్ష్యంగా ఉండాలి.

**స్వీయాత్మక భావవాద రూపాలే అతివాద-మితవాద అవకాశవాదాలు:**

భారత దేశ వాస్తవ పరిస్థితుల నిర్దిష్టత యొక్క ప్రతిఫలనంగా వర్గ వైరుధ్యాలు తలెత్తడం ఆనవాయితి. అయితే ఈ సమస్యలు ఎవరో ఒకరు తమ ఇచ్ఛతో కల్పించి లేదా సృష్టించి, ఏర్పరిచి తిరుగుబాటు లేదా ఉద్యమాలు నడిపి రాజ్యాన్ని వ్యతిరేకించే క్రియాత్మకత కలిగిన సమస్యగా ఏర్పడదని మనం అవగాహన చేసుకోవాలి. దీన్ని మనం దృక్పథం సమస్యగా పరిగణించే వాతావరణంలో భాగంగానే చూడాలి. ఉత్పత్తి శక్తులకు అనుగుణంగా ఏర్పడే నిర్దిష్ట దశ యొక్క ఉత్పత్తి సంబంధాల మధ్య వైరుధ్యంగానే గ్రహించాలి. అయితే ఒకానొక అతివాద అవకాశవాదం వ్యక్తులకు పెద్ద పీట వేసి-వ్యక్తుల యొక్క ఆధిపత్యానికి ప్రథమ స్థానం వహించి ఆ వ్యక్తి ఒక పెద్దన్నగా ఆ పెద్దన్నకు ఉన్న దృక్పథం నుండి ప్రజల సమస్యలపై ఉన్న కోర్కెల-కల్పనలపై ఆచరణాత్మక కార్యాకలాపాలుగా భావించే వాతావరణం నేడు ఒక ప్రధాన సమస్యగా మనం అవగాహన చేసుకోవాలి. నిజానికి మనం నేడు వివిధ కమ్యూనిస్టు పార్టీలను వాటి ప్రజా సంఘాల స్థితినే గమనిస్తే వ్యక్తుల యొక్క సంఘాలుగా

ఆయా వ్యక్తుల కోరికలే ఉద్యమ దృక్పథంగా కార్యాచరణగా ఏర్పడిపోయిన సందర్భాన్ని గమనించవచ్చు. ఈ నేపథ్యంలో ప్రజా సంఘాలు ఒకానొక సూక్ష్మ రూప ఆధిపత్య భావజాల సంస్థలుగా ఏర్పడి ఆయా భావజాల దౌర్భాగ్యమే మార్క్సిస్టు-లెనినిస్టు-మావోయిస్టు సిద్ధాంతంగా చలామణి అవ్వడాన్ని అవగాహన చేసుకోవాలి. ఇకపోతే ఈ నాడు అతివాద అవకాశవాదం విచ్ఛిన్న బీజాలు కలిగిన ముఠాకోరు తత్త్వం కలిగినది, ఇది ఒకానొక కెరీరిస్టు ధోరణిగా సాగుతుంది. నిజానికి ఈ ధోరణి ముఠాల రూపంలో ప్రోగుబడి ఒక ముఠా మరొక ముఠాను నేరుగా రాజకీయ పదజాలంతో దాడులు నిర్వహించుకుంటున్నాయి. ఈ ముఠాలు తమ స్థానంలో పెద్దన్నల పాత్రను ఆమోదిస్తూ ఆ పెద్దన్నల యొక్క కోర్కెలను నడిపిస్తూ ఆ కోర్కెలపై పార్టీ ఆమోద ముద్రను ఏర్పరచే వాతావరణంలో పోటీగా-దూకుడుగా సాగుతున్నాయి. ఈ మొత్తం వ్యవహారం జుగుప్సాకరమైనదిగా తయారై కమ్యూనిస్టు పార్టీ రాజకీయాలంటే కేవలం ముఠాకోరు కెరీరిస్టు అతివాద అవకాశవాదపు వ్యక్తి ప్రతిష్టగా మారిపోయింది. మార్క్సిజంపై అవగాహన లేని ఎందరో సంఘాలల్లో ఉన్నారనేది కాదనలేని సత్యం. అలాగే మార్క్సిజాన్ని అధ్యయనం చెయ్యాలి అనే సంకల్పం కూడా లేని నాయకులు కూడా ఉన్నారనేది ఒక వాస్తవం. ఈ విధంగా ఒక రాజకీయ అధ్యయన కార్యక్రమంలేని సంఘాలుగా నాయకులుగా మిగిలిపోవడం ఒక దీర్ఘకాలిక వెనకడుగుగా చెప్పవచ్చు. ఇకపోతే మరొకరకంగా మధ్యేవాదులు రూపంలో స్థిరమైన నిర్ణయాలు చెయ్యకుండా రాజీ ధోరణితో కూడిన కార్యాచరణ మనకు

తేటతెల్లమవుతున్న వాస్తవం. నిజానికి ఈ మధ్యేవాదులు కూడా ఒక ముఠాగా ఏర్పడి కుట్రపూరితంగా విప్లవకర శక్తులను పారద్రోలే సంకల్పంతో అతివాద అవకాశవాదమని - గ్రూపు రాజకీయమని నిందాపూర్వక రూపంలో ప్రచారం జరుపుతూ విప్లవకర శక్తులను ఇప్పటికే ధ్వంసం చేసేసారు. ఈ రోజు ప్రధానంగా కమ్యూనిస్టు పార్టీ రాజకీయాలకు ఈ అతివాద అవకాశవాదం మరియు మధ్యేవాదుల కార్యాచరణ ప్రధాన సమస్యగా ఉన్నది. ఏమైనా పార్టీ ఈ రెండు దృక్పథాలను ఆచరణలో సరిచేసే అవసరం తీవ్రంగా ఉన్నది.

నేడు ప్రధానంగా కమ్యూనిస్టు పార్టీ మరియు దాని ప్రజా సంఘాలల్లో

1) రాజకీయ లక్ష్యంతో పాక్షిక ఉద్యమాల సమన్వయంతో నడిచే పంథా.

2) కేవలం పాక్షిక ఉద్యమాలు మాత్రమే ఆవశ్యకత అనే ప్రజా సంఘాలకు గల పంథా.

3) రాజకీయ లక్ష్యం-పాక్షిక ఉద్యమాలతో సంబంధంలేని కేవల అస్తిత్వ స్పృహతో కూడిన పంథా.

విభిన్నమైన పాక్షిక ఉద్యమాలపై నిర్దిష్ట రాజకీయ లక్ష్యం ప్రధానంగా రాజకీయాధికార లక్ష్యాన్ని ప్రతిష్టింప చేసే ప్రాధాన్యంతో కూడిన ఆచరణను కొనసాగించే పంథా కమ్యూనిస్టు పార్టీలకు మరియు

వాటి ప్రజా సంఘాలల్లో ఇప్పటికీ ఉన్నది. అయితే ఈ పంథా యొక్క మౌళిక స్వభావం ఆయా నిర్ధిష్ట వర్గ సంఘాల నేపథ్యంగా ఉంటుంది లేదా విభిన్న సంఘాలల్లో వర్గ పొందిక పునాదిగా ఈ పంథా యొక్క దృక్పథం మరియు కార్యాచరణ ఉంటుంది. ఐతే భూమి సమస్యకు నిర్ధిష్ట పరిష్కారం దున్నేవానికి భూమిగా మనకు తెలుసు, అయితే ఈ మౌళిక భావన అనివార్యంగా జనతా ప్రజాస్వామిక విప్లవపు ప్రజా యుద్ధ పంథా ద్వారా ఏర్పడే విముక్తి స్థావరాలపై ఆధారపడి నిలదొక్కుకునే వాతావరణం ప్రధానమైనదని అవగాహన చేసుకోవాలి. ఇదంతా దీర్ఘకాలిక ప్రజాయుద్ధ పంథాగా మన అవగాహన. ఇకపోతే కేవలం పాక్షిక పోరాటాలు ఉద్యమాలు సరిపోతాయి, ఉద్యమాలపై రాజకీయాల స్థాపన అవసరం లేనిదని కేవలం ఆయా వర్గాల ప్రయోజనాలు-వారి హక్కుల దృక్పథంగా ఉద్యమాలు నిర్వహిస్తే సరిపోతుందనే మౌళిక భావన నేడు ప్రబలంగా సాగుతుంది.అలాగే ఈ పంథా రాజకీయ లక్ష్యాన్ని ఎగతాళి చేస్తూ దానికి విభిన్నమైన మౌళికమైన పోరాట రూపాలను యాదృచ్ఛికమైన విధానపు ముసుగులో కొట్టుకుపోతూ-నిర్మాణమవుతూ రాజకీయ లక్ష్యపు వాస్తవ గమ్యాన్ని గాలికి వదిలేస్తుందని ఇప్పటికే రుజువు అవుతుంది. ఈ ధోరణి నేడు మన కార్యాచరణగా ప్రజా సంఘాలపై ఆధిక్యతను కలిగి ఉన్నది. ఇదంతా ఆర్థికవాదం-దీనిపై పోరాటంగా మన కార్యాచరణ లేని సందర్భంలో మన ఉద్యమం పతన స్థితిలోకి జారుకుంటుంది, ఇప్పటికే నాశనం కాబడ్డామని అవగాహన చేసుకోవాలి. అలాగే నేడు

ప్రధానంగా రాజకీయ లక్ష్యం-పాక్షిక ఉద్యమాలతో సంబంధం లేకుండా కేవల అస్తిత్వ స్పృహతో కూడిన పంథాగా ఆయా అస్తిత్వాల నిర్దిష్ట కోర్కెల-హక్కుల సాధనే ప్రధానంగా ఉండే సంఘాలను స్థాపించే ఉద్దేశంతో ఉండే కార్యాచరణను, అలాగే ప్రధానంగా పునాది వర్గాల యొక్క నాయకత్వం యొక్క అస్తిత్వ స్పృహతో కూడిన కార్యాచరణ దృక్పథంగా సాగే అస్తిత్వ సంఘాల వ్యవస్థాపితం ప్రజా ఉద్యమాలను వెనకపట్టు వహించడంగా సాగిపోతున్నాయి. అలాగే ఈ అస్తిత్వ హక్కులు ముఖ్యంగా Residual ideological base గా భ్రమాత్మక చైతన్యపు శ్రమ పాత్రపు వర్గ స్థానంగా చలామణి అయ్యే స్థితిగా అవగాహన చేసుకోవాలి. అయితే నేడు ఈ స్థితి ప్రధానంగా ప్రజా ఉద్యమాలు నడవడం ఒక దౌర్భాగ్య స్థితిగా అవగాహన చేసుకోవాలి. ఏమైనా విప్లవ కమ్యూనిస్టుల పార్టీ మరీ ముఖ్యంగా ఆయా పునాది వర్గాలను ఎదిగించుకునే సందర్భంలో మరీ వాస్తవంగా ఆయా వర్గాల అస్తిత్వ నిర్ణయాలు-వాదనలే రాజకీయ కార్యాచరణకు ప్రధానమైనదిగా సాగడం ముఖ్యంగా ఉన్న లోపం. నిజానికి వర్గ స్థానం యొక్క చైతన్య స్థితే రాజకీయ స్వప్రయోజనార్థపు వాస్తవంగా సాగడం నేడు మనం చూస్తున్న నిజం. ఈ రోజుల్లో ఈ అస్తిత్వవాద నేపథ్యంతో సాగుతున్న నేటి ప్రజా ఉద్యమాలు-ప్రజాసంఘాలని విమర్శిస్తూ వాస్తవ చైతన్యపు పునాది పైకి తీసుకురావడమనే కార్యాచరణ సుదీర్ఘమైన కర్తవ్యంగా, వర్గపోరాటపు ఆవశ్యకంగా సాగడం మన విప్లవ పార్టీ ప్రాధాన్యము. ఐతే విప్లవ పార్టీ తన నాయకత్వాన్ని లేదా పార్టీ సభ్యులను

పరిగణించడంలో వర్గ పోరాటాల అనుభవాల నుండి విభిన్న వర్గ పోరాటాలల్లో పాల్గొన్న నేపథ్యంగా అలాగే కార్మికవర్గ దృక్పథపు చైతన్యముతో సాగే పునాదులపై ఆధారపడి సాగడం ప్రధానంగా ఉన్నదనేది మనకు ఉన్న అవగాహన. అయితే ఈ రోజు వివిధ వర్గ పోరాటాల అనుభవాలల్లో నుండి ఎదిగిన ప్రజా సంఘాల నాయకులు ముఖ్యంగా కార్మికవర్గ దృక్పథపు చైతన్యం యొక్క నేపథ్యంతో ముందుకు వచ్చే కార్యకర్తలపై చులకన భావనతోనూ మరీ ముఖ్యంగా పిల్ల తరహా వాదులని తామంత అనుభవజ్ఞులు లేరని ఈ కార్మిక వర్గ చైతన్యపు commitment ఉన్నవారు బహుశా అధ్యయనపరులు-రచయితలు కావచ్చు అంతేకానీ వారు తమని నిర్దేశించలేరని లేదా గైడ్ చేయలేరనే భావనతో ఉన్నారు. అయితే కార్మికవర్గ దృక్పథపు చైతన్యపు commitment గల వారు వర్గ పోరాట అనుభవజ్ఞుల నుండి నేర్చుకునే స్పృహ ఉంటూనే వారిని ఎడ్యుకేట్ చేస్తూ ప్రజా ఉద్యమాలను నడిపించే కర్తవ్యంతో ఉండాలి. అయితే ఈ రెండు లైన్‌లకు వర్గ పోరాటపు వాస్తవికత ఉందనేది సత్యం. అందుకే వీటి మధ్య ఐక్యతే కాదు అనివార్యంగా ఘర్షణ కూడా ఉంటూ గుణాత్మక స్థాయిలోకి అభివృద్ధి చెందడాన్ని అవగాహన చేసుకోవాలి. కాబట్టి నేడు ప్రజా సంఘాలు వాటి నాయకత్వం వర్గ పోరాటాలల్లో పాలుపంచుకుంటూ కార్మివర్గ దృక్పథ చైతన్యాన్ని ఏర్పర్చుకునే స్పృహ అవసరం. అలాగే ఎక్కడికక్కడ వర్గ పోరాటాలల్లో భాగస్వామ్యమయ్యే వారిని ఎన్నుకుంటూనే ప్రజా సంఘాలల్లోకి కార్మికవర్గ దృక్పథపు చైతన్య

శక్తులను దృఢంగా ఎన్నుకోవాలి. ఇకపోతే వర్గపోరాటాల అనుభవం ప్రధానంగా ప్రజా సంఘాలల్లో సంపూర్ణ స్వభావం కలది కాదనే అవగాహన మనకు అవసరం (శ్రమ విభజన). ప్రజా సంఘాల ఆచరణ మౌళికంగా ఆయా వివిధ పోరాట రూపాలల్లో-పోరాట నిర్మాణాలకి పరిమితమై ఉండేదని అవగాహన చేసుకోవాలి. కాబట్టి ప్రజాసంఘాలకు వాటి నాయకత్వం ఒకానొక పార్శ్వపు అనుభవం (శ్రమ విభజన అనుసారం) కలిగియుంటారు కావున ఈ ప్రజా సంఘాలపై వాటి నాయకత్వంపై సంపూర్ణ కార్మికవర్గ దృక్పథపు చైతన్యం కలిగిన శక్తుల ఆధిపత్యాన్ని ఏర్పర్చి నడిపించే ఆవశ్యకత నేటి అవసరం. ఈనాడు విప్లవ పార్టీ కార్మికవర్గ దృక్పథపు చైతన్యాన్ని ప్రజా సంఘాలపై ఆధిపత్యం వహింప చేసే సమస్యతో ఉన్నది. కావున నేడు మనం ఈ రోజు ముఖ్యంగా కార్మికవర్గ hegemony ని ఏర్పర్చే సమస్య కీలకమైనదిగా ఉంటుంది. దీన్నే మనం Rectify చేసుకునే స్థితిలో ఉన్నాము. ఇకపోతే ఆయా వర్గ పోరాట రూపాలు ఆయా వర్గాల చైతన్య స్థాయిని బట్టి ఏర్పడతాయి, కావున ఈ వర్గ చైతన్య స్థాయి (శ్రమ విభజన) యొక్క వాస్తవ రూపంలో ప్రజా యుద్ధ పంథా యొక్క ఆమోదం ఉండవచ్చు లేదా నేరుగా పార్టీయే వర్గ పోరాటాలను గైడ్ చేయవచ్చు, అయితే పార్టీ ప్రజా యుద్ధ పంథాలో సాగుతూ వర్గ పోరాటాలను నడుపుతున్నప్పుడు ఖచ్చితంగా ప్రజా యుద్ధ పంథా వర్గ పోరాటాలపై ప్రభావం చూపడం అనివార్యం, కానీ ఈ ప్రజా యుద్ధ పంథా ఆయా వర్గ పోరాట రూపాలల్లో, ఆయా వర్గాల చైతన్య

స్థాయిని బట్టే అవగాహన-కార్యాచరణ ఉంటుంది. నిజానికి మన సంఘాలల్లో ఈ నిర్దిష్ట వర్గ చైతన్యపు స్థాయి యొక్క పోరాట రూపాలు మాత్రమే కలిగినవిగా అవగాహన చేసుకోవాలి. అందుకే మన ప్రజా యుద్ధ పంథాను ఆయా వర్గ చైతన్య స్థాయిలోనే అవగాహన చేసుకుంటూ ముందుకు సాగుతున్న నాయకత్వం మనకు గోచరించడం జరుగుతుంది. అందుకే మనం కార్మిక వర్గ చైతన్యపు దృక్పథాన్ని మౌలికంగా establish చేసే కర్తవ్యాన్ని సుధీర్ఘమైన లక్ష్యంతో సాగుతున్నాము. అంతేకానీ పార్టీ గైడ్ చేస్తుంది కాబట్టి ఆయా ప్రజా సంఘాలకు సంపూర్ణమైన ప్రజా యుద్ధ పంథా అవగాహన-అన్వయము ఉండటం జరగదు. అలాగే నిర్దిష్టమైన సుధీర్ఘమైన కార్యాచరణలో కార్మికవర్గ చైతన్య దృక్పథాన్ని ఆధిపత్య స్థాయిలో ప్రతిష్టించకపోతే పార్టీ-ప్రజా సంఘాలు మధ్య ఉండే ఐక్యత-ఘర్షణ వైషమ్య స్థాయిగా అభివృద్ధి చెంది ఆయా ప్రజా సంఘాలే పార్టీకి పూర్తి విరుద్ధమైనవిగా తయారై పార్టీ రాజకీయ లక్ష్యానికి విరుద్ధమైన ఆలోచన-కార్యాచరణలు కలిగినవిగా తయారై destructive స్థాయిలో కొనసాగే పద్ధతిని కలిగియుండే నేపథ్యాన్ని అభివృద్ధి చేస్తాయి. ఇకపోతే ప్రజా సంఘాలల్లో కీలకంగా మూడు తరహాల కార్యకర్తలు ఉన్నారు.

1. విప్లవ ప్రజా పంథావైపు దృఢంగా నిలబడే కార్మికవర్గ చైతన్యపు పునాది కలిగిన కార్యకర్తలు
2. కేవలం అస్తిత్వ-పాక్షిక-ఆర్థిక పోరాటాల దృక్పథంతో కూడిన కార్యకర్తలు.

3. అతివాదపు వ్యక్తి ప్రతిష్ట-మధ్యేవాదపు రాజీ ధోరణిని కలిగిన కార్యకర్తలు ఉన్నారు.

అయితే విప్లవ ప్రజా పంథా వైపు నిలబడే కార్యకర్తలల్లో కూడా సంపూర్ణంగా ప్రజా యుద్ధ పంథాను ఆమోదించే స్థాయిలో లేరనే  వాస్తవాన్ని అవగాహన చేసుకోవాలి. విప్లవం యొక్క మౌళిక అవసరం ఉన్నదనే సత్యాన్ని ఆమోదించినా ప్రజాయుద్ధ పంథా యొక్క స్వభావ భావనను ఆమోదించడంలో confusion ప్రధానంగా ఉండి మొత్తం పార్టీ లైన్‌కి పూర్తి విరుద్ధంగా సాగడాన్ని కూడా చూడవచ్చు. ఆలాగే పార్టీ ప్రజా యుద్ధ పంథాపై పూర్తి అవగాహన మరియు అన్వయం కలిగిన కార్యకర్తలు ఉన్నా వీరి శాతం మరీ ఎక్కువ లేరని అవగాహన చేసుకోవాలి. అలాగే ఈ అవగాహన ఉన్న కార్యకర్తలపై తీవ్రమైన దాడి జరుగుతుందనే స్థితిని నేడు చూడవచ్చు. ఇకపోతే కేవలం అస్తిత్వ-పాక్షిక-ఆర్థిక పోరాటాల దృక్పథం కలిగిన కార్యకర్తలను రెండు విధాలుగా categorize చెయ్యాల్సి ఉంటుంది.

1. ప్రధానంగా కేవల అస్తిత్వ-పాక్షిక-ఆర్థిక పోరాటాల దృక్పథం కలిగినవారుగా సాగడం.
2. అస్తిత్వ-పాక్షిక-ఆర్థిక పోరాటాల దృక్పథం అనివార్యంగా రాజకీయాధికార సాధనకు ఉపయుక్తంగా భావించడం.

నిజానికి ఈ రెండు ధోరణులల్లో ఆర్థికవాదం ఆధునికానంతరవాద ప్రభావం ప్రబలంగా ఉన్నదని అవగాహన చేసుకోవాలి. ఎందుకంటే మనం ప్రజా సంఘాలు-ప్రజా ఉద్యమాలని విప్లవోద్యమంలో వాటి పాత్ర-స్థాయిని బట్టి చూసే దృక్పథంతో ఉంటాము. ఇకపోతే అతివాద అవకాశవాదపు వ్యక్తి ప్రతిష్ట-మధ్యేవాదపు రాజీ ధోరణి అనే పిడివాదం-రివిజనిజాల యొక్క మూలాలతో విప్లవకర పంథా లేదా ప్రజా యుద్ధ పంథా తీవ్రమైన ఆర్థికవాద-ముఠాతత్త్వ గ్రూపు రాజకీయాలతో సతమతమవుతుంది. ఈ రెండు ధోరణులు విప్లవ ప్రజా పంథా యొక్క కొనసాగింపులో ఈ అతివాద మరియు మధ్యేవాదం a serious hurdle గా ఉన్నదని అవగాహన చేసుకోవాలి.

ఇకపోతే మన ప్రజా సంఘాలలోకి ముఖ్యంగా వివిధ మా-లె పార్టీల నుండి ప్రధానంగా ప్రజా సంఘాల నాయకత్వం మన విప్లవ కమ్యూనిస్టు ప్రజా సంఘాలలోకి రావడం జరిగింది. ఇలా వివిధ మా-లె పార్టీల నుండి వచ్చిన వారు మూడు క్యాటగరీలల్లో ఉన్నారు.

1. మౌళికంగా రివిజనిజంతో తెగతెంపులు చేసుకోకుండా విభిన్నమైన కారాణాలతో వివిధ మా-లె పార్టీలని ప్రజా సంఘాలని వీడి మన పార్టీలోకి రావడం.
2. రాజకీయ విధానం-నిర్మాణంతో వచ్చిన వైరుధ్యం నుండి ఆయా మా-లె పార్టీల నుండి విడివడి మన

పార్టీలోకి వచ్చినా రివిజనిజంతో తెగతెంపులు చేసుకోకుండా ఉండటం.

3. విప్లవకర ప్రజాపంథాతో ఉన్నటువంటి వారు అయితే వీరికి ప్రజా యుద్ధ పంథాపై వివిధ confusions ఉన్నాయి.

నిజానికి ఈ ధోరణులను గుర్తించే ఎప్పటికప్పుడు వర్గ పోరాటాన్ని ప్రజా సంఘాలల్లో అంతర్గత చర్చను నడిపించడం జరిపిన-జరుగుతున్న సందర్భం కూడా ఉన్నది. ఈ రకమైన పోరాటాలని నడుపుతున్నప్పుడు రివిజనిస్టు నాయకత్వం ఈ విధమైన అంతర్గత సంఘర్షణను కేవలం సైద్ధాంతిక వ్యవహారంగా చూసింది. నిజానికి వ్యక్తుల మధ్య వ్యవహారంగా కూడా అంచనా వేసి ఈ మొత్తం వర్గ పోరాటాన్ని సైలెంట్ సప్రెషన్ కి గురిచేసిందనే వాస్తవాన్ని అవగాహన చేసుకోవాలి. దీన్ని విప్లవ పార్టీ ప్రజా సంఘాలల్లో ఒకరికొకరు రివిజనిస్టులుగా అభియోగించుకునే అంశంగా పరిగణించి నిర్లక్ష్యం వహించింది. ఈ విధమైన ఉదాసీనత ప్రధానంగా రెండు అంశాలను బహిర్గతపరుస్తున్నాయి.

1. విప్లవ పార్టీ విప్లవకర ప్రజా పంథాను గుర్తించి ఆ పంథా వైపు firm stand వహించకుండా ఉన్నది.

2. ఒకరకంగా అంతర్గత వర్గ పోరాటాన్ని పై నుండి అణచివేయడం జరిగింది. ఈ అణచడంలో

ఒకరినొకరిని ఐక్యపరిచే రాజీ ఫార్ములాని ఎన్నుకోవడం జరిగింది.

దీనితో అప్పటి వరకూ ఉన్న రివిజనిస్టు-నయా రివిజనిస్టు క్యాంపు మధ్య ఐక్యత ఏర్పడి విప్లవ ప్రజా పంథాను ఒక్క దెబ్బకు దాడికి గురి చేయడం జరిగిన చరిత్ర ఉన్నది. ఫలితంగా విప్లవ ప్రజా పంథా అనుసరణీయులు అనివార్యంగా కొట్టుకుపోయే స్థితికి జారుకున్నారు. ఈ విధంగా రివిజనిస్టు క్యాంప్ ఒక ఆధిక్యత స్థితిలో నేడు ప్రధానమైన శక్తిగా ఉన్నది. నిజానికి మౌళికంగా ఈ అవగాహనని పార్టీ సరిగ్గా అంచనా వేసి ఉంటే లేదా అవగాహనకి వచ్చి ఉంటే ఇప్పటి వరకూ ఏర్పడిన నష్టాన్ని చాలా వరకు ఆపి ఉండేది. ఈ విధమైన నిర్లక్ష్యం ప్రజా సంఘాలల్లో లిగలిజానికి కూడా దారి తీసింది.

1. ఇకపోతే ఈ రివిజనిస్టు ముఠా రాజ్యాంగ యంత్రాన్ని-రాజ్యాన్ని అతిగా చూపించి మొత్తం విప్లవ శక్తులను భయాందోళనలకు గురిచేసి చిన్నబుచ్చారు. నిజానికి రాజ్యాన్ని ఆధునికమైనదిగా దాన్ని ఢీకొట్టడం విప్లవ శక్తులకు తరంకాదనే నేపథ్యంగా ఈ వాదన వచ్చింది.

2. అలాగే రాజ్యాంగం యొక్క ప్రజాస్వామ్యము-లిబరల్ స్వభావం మౌళికంగా పోరాట హక్కులను సాధించే విధంగా ఉన్నదని దీని ఫలితంగా చట్టబద్ధ పోరాటాలే హక్కులను సాధించే కర్తవ్యంగా ఉన్నది కాబట్టి, ఆయా చట్టబద్ధ పోరాటాలు నిర్వహిస్తే సరిపోతుందనే వాదనను లేవనెత్తారు.

3. ఈ విధమైన చట్టబద్ధతతోనే హక్కులు సాధింపబడే ఆవశ్యకం కాబట్టి, న్యాయ వ్యవస్థ ద్వారా కోల్పోయిన హక్కులు సాధించే స్థితే పోరాట పంథాగా మారిపోయి ప్రతీ ప్రజా పోరాటం న్యాయ వ్యవస్థ ద్వారా పరిష్కరింపబడుతుందనే స్వభావంతో సాగిపోతున్నారు.

ఇదంతా సర్వసాధారణంగా రాజ్యపు సాధారణ స్వభావంతో ఐక్యమయ్యే విధానంగా ముందుకు సాగిపోతుంది. ఈ లిగలిజం మన రాజ్యాధికార లక్ష్యానికి ఒక అడ్డంకిగా మారిపోతున్న వాస్తవం. పార్టీ-ప్రజా సంఘాల యొక్క రాజకీయ లక్ష్యాన్ని వర్గ పోరాట రూపం-నిర్మాణంతో కూడిన స్థాయిలో నిర్మాణాన్ని ఏర్పర్చుకుని, రాజకీయాధికార స్వాధీనపు వ్యూహం-ఎత్తుగడల నిర్మాణం ఏర్పర్చకపోతే ఇదంతా లిబరలిజంగా ఏర్పడి సులభంగా పార్టీకి వ్యతిరేకంగా మారిపోతుంది. వాస్తవానికి రాజ్యంగం-రాజ్యం అత్యంత కీలకంగా బడా బూర్జువా వర్గపు ప్రయోజనాలను బడా భూస్వామ్య వర్గాల లక్ష్యాన్ని అత్యంత దూకుడుగా అమలు చేసే కర్తవ్యంగా సాగటాన్ని అవగాహన చేసుకోవాలి. రాజ్యాంగం లిబరల్ స్వభావం కలిగినదిగా ఉన్నది. లిబరలిజం బూర్జువా వర్గపు రాజకీయ తాత్త్వికతగా చూడాల్సినది. అలాంటిది నేడు ఒకానొక వర్గ పోరాటాన్ని ఈ రోజు పూర్తిగా రాజ్యాంగపు ముసుగులో చూసే-వ్యవహారించే దృక్పథాన్ని ఈ రివిజనిస్టులు కల్పిస్తున్నారు.

ఇకపోతే మన పార్టీ అవగాహనలోని నిర్దిష్ట మౌళిక వైరుధ్యాలు

1. సామ్రాజ్యవాదానికి-అశేష పీడిత ప్రజలకు
2. వేతన శ్రమకు-పెట్టుబడికి
3. బడా బూర్జువా-అశేష పీడిత ప్రజలకు
4. భూస్వామ్యానికి-అశేష పీడిత ప్రజలకు
5. సోషల్ సామ్రాజ్యవాదానికి-అశేష పీడిత ప్రజలకు (చైనా సోషల్ సామ్రాజ్యవాదం)

ఈ మౌళిక వైరుధ్యాలను పరిగణిస్తూ మన విప్లవ పార్టీ ప్రధాన వైరుధ్యాన్ని భూస్వామ్యానికి-అశేష పీడిత ప్రజలకు అని భావిస్తూ భూస్వామ్యానికి వ్యతిరేకంగా పోరాటాన్ని ఎక్కుపెట్టింది. కానైతే ఈ పోరాటంలో మొత్తం అశేష ప్రజలకు అని పరిగణించినప్పుడు మౌళికంగా రెండు అంశాలు వ్యక్తమవుతాయి పోరాట వర్గాలు రెండు పోరాట రూపాలుగా ఉంటాయి అవి

1. Direct conflict classes
2. Indirect conflict classes

అలాగే పోరాట రూపాలుగా Direct conflict classes పై ఆధారపడటం మనం వర్గ పోరాట ఉన్నత దశయైన సాయుధ పోరాటంగా నడిచే సందర్భం ఉంటుంది, అలాగే Indirect conflict

classes తో వివిధ విభిన్న వర్గ పోరాట రూపాలను ఆయా విభిన్న వర్గాలతో ఉండే వైరుధ్యాలపై ఆధారపడుతూ పోరాటాలని Direct conflict classes యొక్క రాజకీయ లక్ష్యంతో ముడిపడిన అంతిమ విముక్తి కార్యాచరణను ఏర్పరుస్తూ సాగడం జరుగుతుంది. అందుకే ఈ Indirect conflict classes యొక్క వైరుధ్యాలు రాజకీయ లక్ష్యంతో ఒక సాధారణ స్వభావాన్ని సంతరించుకునే ఏకమొత్తపు పంథాని అభివృద్ధి చేసుకునే వాతావరణం అవసరం ఉంటుంది, ఆ పంథాన్నే మనం దీర్ఘకాలిక ప్రజా ఉద్యమంగా పరిగణించాలి. నిజానికి ఐక్యసంఘటనను మొత్తంగా అభివృద్ధి పరుచుకున్నా ఆయా వర్గాలు రాజకీయ లక్ష్యాన్ని నిర్దేశించుకోవడం కీలకం. ఇకపోతే మన ప్రజా పంథా మౌళికంగా ఆత్మరక్షణ పోరాట సందర్భం నుండే ఏర్పడి-కొనసాగే వాస్తవాన్ని కాదనలేము. నిజానికి ప్రజాయుద్ధం లేదా ప్రజా ఉద్యమం మౌళికంగా ఆత్మరక్షణగా కొనసాగుతూ నిలదొక్కుకుంటూ ముందుకు సాగడం అనివార్య యదార్థం అయితే ఈ ఆత్మరక్షణ పద్ధతి అనివార్యంగా సాయుధ గెరిల్లా యుద్ధం రూపంలోనైనా ప్రజా పోరాట రూపంలోనైనా అభివృద్ధికి ఒక ఆవశ్యకము ఇదంతా ఎదురుదాడికై ఒక సమతుల్య స్వభావాన్ని సంతరించుకునే కార్యాచరణ.

విప్లవ పార్టీ మౌళికంగా విభిన్నమైన వర్గ పోరాటాలని-వర్గ పోరాటాల రూప నిర్మాణాలని అభివృద్ధి పరిచే సందర్భం ఒక తీవ్రమైన విషయంగా అవగాహన చేసుకోవాలి. ఏదేమైనా ఈ సాధారణమైన గ్యాప్ కీలకమైనదిగా ఉన్నది. వాస్తవంగా సామ్రాజ్యవాద

వ్యతిరేక పోరాటాలని నడపడంలో ప్రధానంగా వెనకబడే ఉన్నాము. కార్మిక రంగంలో నిలదొక్కుకోలేదనేది వాస్తవం. ఈ విధంగా Direct conflict classes (వ్యూహాత్మక వర్గపోరాటం) మరియు Indirect conflict classes (ఎత్తుగడల వర్గపోరాటం) మొత్తాన్ని సమీకరణ చేసుకొని సాగే సందర్భంలో ఇంకా వెనకబడే ఉన్నాము. మన ఉద్యమ చరిత్రలో తీవ్రమైన కృషి జరిగింది కానీ తీవ్రమైన సెట్ బ్యాక్స్ కు గురైనాము.

అయితే పార్టీ ప్రజా యుద్ధ పంథాను అమలు చేస్తూ ప్రజా ఉద్యమాన్ని ఆర్గనైజ్ చేసి నడుపుతున్న వాతావరణంలో రివిజనిజం మౌళికమైన సమస్యగా ఉన్నదనేది సత్యం. పార్టీ ప్రజా యుద్ధ పంథాని రివిజనిజానికి వ్యతిరేకంగా అభివృద్ధి మరియు అమలు చేయడం జరిగిందనేది చరిత్ర ఐతే రివిజనిజంపై పోరాటం అయిపోయిందని అది అన్ని స్థాయిల్లో అంతటా లేని సమస్యగా ఉన్నదని అయితే పార్టీలో ప్రజా సంఘాలల్లో రివిజనిస్టులు అని వ్యాఖ్యానించుకోవడం అనేది లేని రివిజనిజాన్ని ఎత్తిపట్టడమే అని పార్టీ అవగాహనలోకి వచ్చి రివిజనిజానికి వ్యతిరేకంగా జరుపుతున్న ఉద్యమాన్ని చేజేతులారా నీరుకార్చేసింది. దాని ఫలితమే ఎన్నో అన్యవర్గ ధోరణులతో ఈ రోజు ప్రజా సంఘాల కార్యాచరణే దెబ్బకు వెనకపట్టు పట్టిందనేది సత్యం. అంతేనా పార్టీ-ప్రజాసంఘాలల్లో వస్తున్న రివిజనిజపు చర్చను ప్రధానంగా నిర్లక్ష్యం చేస్తూ చారుమజుందార్ రివిజనిజం అనే చర్చను పార్టీకి వర్తింప చేసాడు కానీ ప్రజా సంఘాల

విషయంలో చర్చను-వాదాన్ని లేవనెత్తలేదనే స్థితిని తీసుకుని ఈ పోరాటంలో పాలుగున్న క్యాడర్‌ను ఒకింత గందరగోళపరిచిన సందర్భం కూడా ఉన్నది. ఇదంతా రాజీ ధోరణిని ఏర్పర్చాలనే సంకల్పంతో సాగింది. ఒక పరిధిలో ఈ రివిజనిస్టు వ్యతిరేక పోరాటం తీవ్రమైన దాడికి గురైంది. ఈ దాడి వ్యక్తిగతంగా సాగింది.నిజానికి ఆనాటి రివిజనిస్టు వ్యతిరేక పోరాటం విప్లవ కమ్యూనిస్టు క్యాడర్లో నూతనుత్తేజాన్ని కలిగించింది.ఎందరో ఈ రివిజనిస్టు వ్యతిరేక పోరాటంలో భాగంగానే ఉన్నతమైన రాజకీయ కార్యాచరణకు పూనుకోవడానికి కారణమనే చెప్పాలి. నిజానికి ఈ పార్శ్వాన్ని ఎక్కడా బయటకు రానీయకుండా చరిత్రను వ్యాఖ్యానించడం జరిగింది కూడా. అయితే మరొక ప్రక్క విప్లవ పార్టీ నూతన పోరాటాలని వాటి నిర్మాణాలని ప్రోత్సాహించడం జరిగింది కూడా. ఎప్పుడైతే నూతన పోరాటాలని నిర్మించడంలో స్థానిక కమిటీలకు చేయూతనిచ్చిందో ఆ మరు క్షణం ఈ నూతన పోరాట రూపాలు-నిర్మాణాలు అనివార్యంగా రివిజనిస్టు స్వభావానికి వ్యతిరేకంగా పోరాడటంలో నూతనోత్తేజాన్ని కలిగించింది. నిజానికి పార్టీ ఈ ఉత్తేజం-ఉత్సాహాన్ని క్రింది క్యాడర్‌కు అందించి పెంపొందించింది. ఐతే రివిజనిజానికి వ్యతిరేకంగా పోరాటం కేవలం సంస్థాగత అంశంగానే ఆనాడు భావించి పోరాడటం జరిగింది. నిజానికి రివిజనిజాన్ని కేవలం నిర్మాణయుత వ్యవహారంగానే చూసాము.

కానీ అది అంతర్జాతీయ-జాతీయ వ్యవహారంగా ముందుకు వచ్చిన సమస్యగా గుర్తించే స్కోప్ లేదు-అవగాహనకు రాలేదు కూడా. కానీ పోను పోనూ అంతర్జాతీయంగా-జాతీయంగా వస్తున్న మార్పులను గ్రహిస్తూ వస్తున్నప్పుడు రివిజనిజం ఒక సైద్ధాంతిక-ఆచరణాత్మక వ్యవహారంగా దానిపై పోరాటం దీర్ఘకాలిక కర్తవ్యంగా విప్లవానికి ముందు-విప్లవోద్యమంలో-విప్లవ విజయం తరువాత ఎదురుకునే విషయంగా అవగాహన అవుతూ వచ్చిన భౌతిక వాస్తవికతని విస్మరించలేము. దీనికై నేపాల్ మావోయిస్టు పార్టీ క్రమక్రమంగా రివిజనిస్టు క్యాంపుగా పరిణమించడం అలాగే చైనా సోషల్ సామ్రజ్యవాదంగా ఎదిగి జిన్ పింగ్ ఆలోచనా విధానపు రివిజనిజం అంతర్జాతీయంగా-జాతీయంగా ఆధిక్యం వహించడం దీనితో పాటుగా అమెరికాలోని బాబ్ యొక్క నూతన సంవాదపు రివిజనిజం యొక్క పరిణామాలు మన జాతీయ పరిస్థితులపై ప్రభావం చూపాయనడంలో అతిశయోక్తి కాదనేది సత్యం. మరొకప్రక్క 2008 గృహ రుణ సంక్షోభం ఫలితంగా ప్రపంచవ్యాప్తంగా ప్రజా ఉద్యమాల అభివృద్ధి-పెరుగుదలల ఆవశ్యకతను మనం గమనించాము అయితే ఈ నేపథ్యంలో సామ్రాజ్యవాద-బడా బూర్జువాల స్థిరత్వం కోసం ప్రయత్నిస్తూ 'కుక్క తాను తినదు-వేరొకరిని తిననియ్యదు' అనే వ్యవహారంగా తాను నిలదొక్కుకోదు ప్రజా ఉద్యమాలు నిలబడకూడదు అనే సూత్రంతో సాగే సందర్భంలో ఉన్నాము. ఈ

నాడు గృహ రుణ సంక్షోభం రోజు రోజుకూ తీవ్రరూపం దాల్చి ప్రపంచాన్ని పట్టి పీడిస్తున్న సందర్భంలో ఉంటే మరొక ప్రక్క ఈ సంక్షోభ నేపథ్యం నుండి ప్రపంచ ఆధిపత్యానికి చైనా సోషల్ సామ్రాజ్యవాదం తెరపైకి దూసుకు వస్తుంది. అమెరికన్ సామ్రాజ్యవాదానికి-చైనా సామ్రాజ్యవాదానికి మధ్య ఉన్న పోటీ ఫలితంగా దేశంలో స్థిరత్వం కొరవడుతూ ఈ సోషల్ సామ్రాజ్యవాదపు-అమెరికన్ సామ్రాజ్యవాదపు ప్రయోజనాలను కొమ్ముకాసే మధ్యేవాదిలా తనను తాను మలుచుకుని సాగుతున్న వాతావరణం మనకు గోచరిస్తున్నది. ఇటువంటి నేపథ్యంలో మనం రివిజనిజానికి వ్యతిరేకంగా పోరాటం చేయడమనేది హాస్యాస్పదంగా భావించే కార్యకర్తలు లేక కాదు కానైతే పోరాటం అనేది ఒక ఆవశ్యకమైన సందర్భంగా మనం అవగాహన చేసుకోవాల్సిన అవసరం ఉన్నది. ఈనాడు దేశ వ్యాప్తంగా చైనీస్ రివిజనిస్టు ప్రభావం ప్రబలంగా ఉన్నదనేది వాస్తవం. దీనికి వ్యతిరేకంగా పోరాడటం ఈ రోజు అనివార్య కర్తవ్యం కూడా. ఈ రివిజనిస్టు వ్యతిరేక పోరాటం కేవలం సైద్ధాంతిక స్థాయిలో ఉండే వ్యవహారం కాదు అది నేటి ఆచరణలో ఎదుర్కొనే తక్షణ సమస్యగా పరిగణించి పోరాడాలి. ఈ రోజు జింగ్ పింగ్ ఆలోచనా విధానపు రివిజనిజానికి వ్యతిరేకంగా పోరాడాల్సిన తక్షణ సందర్భంలో ఉన్నాము. ఈ జింగ్ పింగ్ ఆలోచనా విధానం డేంగిజపు అత్యున్నత రూపంగా సోషల్ సామ్రాజ్యవాదపు తాత్త్వికతగా ప్రపంచాధిపత్యాన్ని సామాజిక-రాజకీయార్థిక-భావజాలాధిపత్య సమాహారంగా సాగే సందర్భంగా విజృంభిస్తున్న సమయంలో ఉన్నాము.

**డేంగిజపు అత్యున్నత రూపం జింగ్ పింగ్ ఆలోచనా విధానం:**

జింగ్ పింగ్ ఆలోచనా విధానం 14 మౌళిక విధానాల ఆధారంగా రూపొందింది అవి ప్రధానంగా చైనా దేశీయ పరిస్థితులకు అనుగుణంగా సామ్యవాద రూపకల్పన, అందుకోసం సమగ్ర గుత్త పెట్టుబడి ఆధారిత సంస్కరణల తీవ్ర అమలు, ప్రజల ప్రజాస్వామ్య సుస్థిరత్వం, జాతీయ రక్షణ వ్యవస్థ పటిష్టత్వం, పర్యావరణ మరియు సామరస్య పూరిత శాంతి స్థాపన కోసం బలమైన గుత్త పెట్టుబడి పునాదిగా మార్క్సిజం, కమ్యూనిజపు తాత్త్విక నేపథ్యంగా సాగడమనే విధానాన్ని తీసుకురావడం. కావున నేటి చైనా సామ్రాజ్యవాద తాత్త్వికతకు డేంగిజపు అత్యున్నత రూపంగా జింగ్ పింగ్ ఆలోచనా విధానం అభివృద్ధి కాసాగింది. ఇందులో గుత్త పెట్టుబడితో మార్క్సిజం మరియు లెనినిజపు సాంప్రదాయకమైన భావజాలాన్ని ఐక్యపరచి కొనసాగడం. అందుకే సోషల్ సామ్రాజ్యవాదంగా పెట్టుబడిదారీ వ్యవస్థ అత్యున్నత రూపంగా చలామణి అవ్వడంగా అవగాహన చేసుకోవచ్చు.

డేంగిజం యొక్క మౌళిక స్వభావ రూపంలో వ్యక్తమయ్యే ముఖ్యమైన అంశాలు 1) ఉత్పత్తిలో ఆధునికత ఆహ్వానానికై సంస్కరణల పేరుతో వ్యక్తిగత హోదా పెట్టుబడికి అవకాశాల రూపంలో తెరవబడిన ప్రక్రియ. 2) ఆధునికత వైపుగా సాగుతున్నవేల కమ్యూనిస్టు పార్టీ యొక్క భావజాలాత్మక ఐక్యత యొక్క సంరక్షణార్థం కలిగిన భావజాల సాంప్రదాయ కొనసాగింపు.

డేంగిజం ప్రతిపాదించిన ఆధునికత చెందవలసిన అంశాలు:

- వ్యవసాయం
- పరిశ్రమ
- జాతీయ రక్షణ వ్యవస్థ
- శాస్త్ర-సాంకేతికత

డేంగిజపు భావజాల సాంప్రదాయతకై నాలుగు మౌళిక సూత్రాలు:

- కమ్యూనిజం యొక్క పునాదిని సమర్ధించడం పేరుతో పెట్టుబడిదారీ వ్యవస్థను సంరక్షించడం
- కార్మికవర్గ నియంతృత్వం స్థానంలో ప్రజల ప్రజాస్వామిక నియంతృత్వమనే రాజకీయ వ్యవస్థను ఏర్పర్చడం
- రివిజనిస్టు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్ని సమర్ధించడం
- పెట్టుబడిదారీ నాయకత్వంలో మార్క్సిజం లెనినిజం మరియు మావో ఆలోచనా విధానాన్ని ఎత్తిపట్టడం

డేంగిజం యొక్క మౌళిక లోపం వ్యవసాయం, పరిశ్రమ, జాతీయ రక్షణ వ్యవస్థ, శాస్త్ర సాంకేతికతలో ఆధునికత పేరుతో

విదేశీ పెట్టుబడులను, సంస్కరణల పేరుతో వ్యక్తిగత హోదా పెట్టుబడికి అవకాశాల రూపంలో తెరవబడిన ఆర్థిక వ్యవస్థగా తీర్చిదిద్దడం అనే కార్యాన్ని కొనసాగించడం. ఈ కార్యసిద్ధికై ఒక బలమైన మార్క్సిజం-లెనినిజం-మావోయిజపు భావజాల సాంప్రదాయాన్ని మౌళిక భావనగా ఎత్తిపట్టే కార్యాన్ని కొనసాగించడం కోసం కార్యకలాపాల సన్నద్ధతను, అమలును చేసుకుంటూ వ్యక్తిగత హోద పెట్టుబడికి మరియు సాంప్రదాయ భావజాలమైన మార్క్సిజం-లెనినిజం-మావోయిజానికి ఐక్యతని కుదర్చడం, సర్దుబాటు చేయడంగా సాగడం. గతితార్కిక భౌతికవాదానికి భిన్నంగా బూర్జువా రాజకీయ ఆర్థిక ఫలిత ప్రాధాన్యవాదాన్ని ముందుకు తెచ్చాడు, ఫలితంగా వ్యవసాయంపై ఆస్తి హక్కును రద్దు చేసే దిశగా సాగలేదు, పారిశ్రామిక జాతీయత కనుమరుగు అయ్యింది, జాతీయ రక్షణ వ్యవస్థ ప్రైవేటీకరించబడింది, శాస్త్ర-సాంకేతికత గుత్తగా మారిపోయింది. దీనితో తమ మౌళిక సూత్రాలకు పూర్తి భిన్నమైన ఫలితాలు పుంజుకున్నాయి, వైషమ్యంగా మారాయి. కమ్యూనిస్టు పార్టీ పేరుతో బూర్జువాజీ సోషలిజం అమలు చేస్తూ ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంపై ప్రభావం వహించింది.

ఇకపోతే మన భారత దేశంలోని కమ్యూనిస్టు పార్టీలకు సైతం డేంగిజపు స్వీయాత్మక భావవాదమనే ఆధునిక రివిజనిజం ఒక అంటు రోగంగా సాగుతుందనే అర్థం చేసుకోవాలి, అవగాహన చేసుకోవాలి. భారత దేశంలోని రివిజనిస్టు కమ్యూనిస్టు కార్యాచరణ,

వారి ఎజెండా మౌళికంగా ఉత్పత్తిలో ఆధునికత ఆహ్వానానికై సంస్కరణల పేరుతో వ్యక్తిగత హోద పెట్టుబడికి అవకాశాల రూపంలో తెరవబడిన ప్రక్రియగానే సాగుతుంది (దీనిని మనం కేరళలోని కమ్యూనిస్టు పరిపాలనలో గమనించవచ్చు) ఐతే ఈ ప్రక్రియను మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం అనే భావజాలాత్మక సాంప్రదాయ రూపంలో కొనసాగించే ప్రయత్నాన్ని స్పష్టంగా గమనించగలం, ఫలితంగా వాటి మధ్య ఐక్యతను ఏర్పర్చి బూర్జువాజీ సోషలిస్టు నియంతృత్వాన్ని కొనసాగించే వాతావరణాన్ని చూడవచ్చు. కావున ఈ ప్రక్రియకు మౌళికమైన భారతీయ పార్లమెంటరీ విధానం సరితూగుతుంది, కావున మన రివిజనిస్టు కమ్యూనిస్టుల ఆధునిక భావజాల-కార్యాచరణ పార్లమెంటరీ డేంగిజంగా పరిగణించాలి. నిజానికి ఎన్నికలను ఎత్తుగడగా ఒకానొక పోరాట రూపంగా పరిగణించే కార్యక్రమం సైతం డేంగిజపు మౌళిక భావజాల దృక్పథం-కార్యాచరణను కొనసాగించే విధానంగా పరిగణించాల్సిన అవసరం ఉంటుంది. అందుకే ఎన్నికలను బహిష్కరించాల్సిన కర్తవ్యం కేవలం పార్టీకే కాకుండా ప్రజా సంఘాలకు సైతం అవసరం-ఆవశ్యకంగా మనం గ్రహించాలి. ఈ నేపథ్యంగా సాగడం తక్షణ కార్తవ్యం.

అలాగే సాయుధ డేంగిజాన్నే మనం ప్రతిఘటణ పోరాటం లేదా పాక్షిక గెరిల్లా పోరాటంగా అభివర్ణిస్తాము. అయితే ఇక్కడ గమనించాల్సినదేమంటే ప్రతిఘటన-పాక్షిక గెరిల్లా పోరాటాలు ఒకానొక ఆత్మరక్షణ దశ యొక్క స్వభావాన్ని సంతరించుకున్నా రాజకీయాధికార

హస్తగత సమస్యను పరిగణించకుండా ఆచరించకుండా సాగితే అవి సాయుధ డేంగిజపు స్వభావాన్ని సంతరించుకున్నట్లే. ఈ సాయుధ డేంగిజం ఆర్థికవాద మూలాలతో సాగుతుంది దీనికంటూ ఒక స్పష్టమైన రాజకీయ లక్ష్యం అందుకు సాయుధ పోరాట వ్యూహం మరియు ఎత్తుగడలు ఉండవు. సాయుధ పోరు అనగా ప్రతిఘటణ లేదా పాక్షిక గెరిల్లా పోరాటం ప్రజల ఆర్థిక హక్కుల సాధన దిశగా ఏర్పడి ఉత్పత్తిలో సంస్కరణల పేరుతో వ్యక్తిగత హోద యొక్క అవకాశాల రూపంలో తెరవబడిన ప్రక్రియగా ఉంటూనే కేవలం ఆర్థిక స్వాతంత్ర్యమే-ఆర్థిక హక్కుల సాధనతోనే ప్రతిఘటన మరియు పాక్షిక గెరిల్లా పోరాటం ద్వారా పరిష్కారం సిద్ధిస్తుందనే కార్యాచరణను గమనించగల సాయుధ పోరాట కమ్యూనిస్టులను చూడవచ్చు. ఈ ప్రక్రియకు మార్క్సిజం-లెనినిజం-మావోయిజాలను సాంప్రదాయ భావజాల పునాదిగా వాడుకుంటూ సాగుతారు. అందుకే వీరిని సాయుధ రివిజనిస్టులు లేదా సాయుధ డేంగిస్టులుగా అభివర్ణిస్తారు. ఈ జాడ్యం నేటికీ మనం గమనించవచ్చు.

అంతేకాకుండా సాహిత్య డేంగిజం కమ్యూనిజం యొక్క పునాదిని సమర్థించడం, ప్రజల ప్రజాస్వామిక నియంతృత్వమనే రాజకీయ వ్యవస్థ, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్ని సమర్థించడం, మార్క్సిజం లెనినిజం మరియు మావో ఆలోచనా విధానాన్ని ఎత్తిపట్టడం అనే సాంప్రదాయ భావజాలాన్ని సాహిత్యంలో కొనసాగించే విధానం ప్రధానంగా సాగుతూనే మరొక ప్రక్క ఉత్పత్తిలో ఆధునికత

ఆహ్వానానికై సంస్కరణల పేరుతో వ్యక్తిగత హోద పెట్టుబడికి అవకాశాల రూపంలో తెరవబడిన ప్రక్రియను సమర్ధించే ఆచరణాత్మకతను ప్రోత్సాహకరంగా సాగడాన్ని గమనించవచ్చు. ఈ విధానాన్ని మనం నేటికీ సాహిత్యంలోకి చొప్పించి అభివృద్ధి చేయడాన్ని గమనించగల సాహిత్య రివిజనిజంగా గమనించాలి. ఇదే రూపంలో ప్రజా సంఘాలు డేంగిజపు మౌళికమైన స్వభావంతో కూరుకుపోయి ఉన్నాయి. మార్క్సిజం-లెనినిజం-మావోయిజం ప్రధానంగా ఉంటూ మరొక ప్రక్క పెట్టుబడి యొక్క వ్యక్తిగత హోదాతో ఈ విప్లవకర భావజాలాన్ని ఐక్యపరుస్తూ రాజకీయ లక్ష్యమైన రాజకీయాధికార హస్తగతం కేవలం పార్టీ పనిగా తమది కేవలం ఆ రాజకీయ భావజాలంతో ఉన్నటువంటి ఈ వ్యవస్థతో సరిపుచ్చి కాలక్షేపం వహిస్తున్న రివిజనిస్టు డేంగిస్టులు ప్రజా సంఘాల రూపంలో దర్శించడం ఒక వాస్తవం దాన్ని కాదని ప్రక్కకు నెట్టేసే స్థితి మనల్ని మనం మోసం చేసుకుంటూ భవిష్యత్తుకు తూట్లు పొడుచుకునే ప్రక్రియనే. కావున ఇదంతా మారాల్సిన సందర్భం-వ్యవహారం ఉన్నది.

డేంగిజం ఉత్పత్తిలో ఆధునికత ఆహ్వానానికై సంస్కరణల పేరుతో వ్యక్తిగత హోద పెట్టుబడికి అవకాశాల రూపంలో తెరవబడిన ప్రక్రియ లేదా జింగ్ పింగ్ ఆలోచనా విధానమైన దేశీయ గుత్త పెట్టుబడిదారీ వ్యవస్థ అనుగుణమైన సామ్యవాద ప్రక్రియలకు వ్యతిరేకంగా జాతీయకరించడం అనే ప్రక్రియకు పెట్టుబడి యొక్క

వ్యక్తిగత హోద రద్దుకు సంబంధించిన విధానాన్ని బలంగా ముందుకు తీసుకుని రావడం అలాగే పెట్టుబడి మరియు గుత్త పెట్టుబడి ఆధ్వర్యంలోని ఆధునికత వైపుగా సాగుతున్నవేల కమ్యూనిస్టు పార్టీ యొక్క భావజాలాత్మక ఐక్యత యొక్క సంరక్షణార్థం కలిగిన మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానపు భావజాల సాంప్రదాయ కొనసాగింపు కాకుండా జాతీయకరణ-పెట్టుబడి వ్యక్తిగత హోద రద్దు ప్రక్రియ ఐక్యతలో మార్క్సిజపు మౌళిక భావజాల సాంప్రదాయ ఐక్యతను ఎత్తిపట్టడం ముఖ్యము.

ఇకపోతే రాజకీయ అధికార హస్తగతం అనే సమస్యలో మనం నేడు గమనిస్తున్న రెండు డేంగిస్టు పంథాలు ఏమనగా పార్లమెంటరీ డేంగిజం మరియు సాయుధ డేంగిజంలు. నిజానికి ఈ రెండు పంథాలు నిర్దిష్ట వ్యవస్థ తాలుకు పరిధిలోనే తమ యొక్క లక్ష్యాలను, గమ్యాలను చేరుకోగలమనే విధానానికి పునాదిగా సాగడం ఒకటి బడా బూర్జువా-బడా భూస్వామ్య వ్యవస్థలో భాగంగా పార్లమెంటరీ విధానంతో ముందుకు రావాలని, ఆ పద్ధతిలోనే స్వేచ్ఛా వ్యాపార విధానాన్ని కొనసాగిస్తూ సాగాలని అందుకోసం మార్క్సిజపు భావజాల ఐక్యతతో సాగాలనే తాపత్రయం. మరొక పంథా ప్రతిఘటనా పోరాట వెల్లువగా ఆర్థిక హక్కుల సాధనకై ఆత్మ రక్షణా స్థితిగా సాయుధ పాక్షిక గెరిల్లా పోరాటంగా అభివృద్ధి అయ్యి నిర్థిష్ట వ్యవస్థలో సాధించే ఆర్థిక డిమాండ్ల లక్ష్యమే అంతిమంగా మలిచే ప్రక్రియనే సాయుధ డేంగిజం. కావున మనం ఆర్థిక హక్కుల కొరకు పరిమితం అయ్యే

దిశగా కాకుండా అలాగే పార్లమెంటరీ విధానంలో కూరుకుపోకుండా రాజకీయ అధికార హస్తగతంకై దీర్ఘకాలిక సాయుధ పోరాటం పునాదిగా చారుమజుందార్ మార్గదర్శకత్వంలో సాగుదాం. డేంగిజంకు, జింగ్ పింగ్ ఆలోచనా విధానానికి వ్యతిరేకంగా పోరాడటం నేడు కీలకమైన అవసరం.

## (II)

**చారుమజుందార్ Contribution:**

వాస్తవంగా పార్టీ-సాయుధ పోరాటం-ప్రజా ఉద్యమం/ ఐక్య సంఘటణల యొక్క ఐక్యత-విశిష్టతలు-భేదాలు-ప్రత్యేక పాత్రల విషయంలో మౌళికంగా మనం ఇప్పటి వరకు విప్లవ కార్యాచరణలో భాగంగా విశ్లేషణ-ఆచరణలలో అనుభవం గడించడం జరిగింది. కానైతే విభిన్నమైన దృక్పథాలు పార్టీ-సాయుధ పోరాటం-ఐక్య సంఘటనల ఆచరణలపై ఉన్నాయి. కొందరు మౌళికంగా పార్టీ-సాయుధ పోరాటం-ఐక్య సంఘటనల మధ్య భేద భావం (dualism) ఉంటుందని ఈ భేదం శాశ్వతమైనదని వాదిస్తే, మరికొందరు మొత్తం పార్టీ దాని పంథా యొక్క విశేషాలుగా సాయుధ పోరాటం మరియు ఐక్యసంఘటనలు ఉంటాయి (peculiar monism), అయితే ఈ విశేషాలు వాటికవే అస్తిత్వాలుగలవని అవి అనివార్యంగా పార్టీ దాని పంథాలో ఆత్మిక అనుబంధంగా అంతిమ ఐక్యముగా పార్టీ దాని

పంథాలో విలీనమే విముక్తంగా పరిగణించే దృక్పథం-కార్యాచరణగా సాగుతారు. అయితే మనం పార్టీ-సాయుధ పోరాటం-ఐక్య సంఘటనల ఏకత్వాన్ని-కేంద్రీకృతాన్ని-ఒకే భావనని స్థాపించడమే లక్ష్యంగా దృక్పథంగా సాగడమే చరిత్రపై ఆచరణపై monistic approachగా పరిగణించాలి. కామ్రేడ్ చారుమజుందార్ ద్వంద్వవాద (dualism) వైఖరికి వ్యతిరేకంగా విశిష్టాద్వైతవాద (peculiar monism) వైఖరికి వ్యతిరేకంగా monistic dialectical approach ని స్థాపించే ప్రయత్నం చేసారు. ఆయన ప్రధానంగా philosophically materialistic dialectical monismపై ఆధారపడే విప్లవ వ్యూహం-ఎత్తుగడలను స్థాపించడం జరిగింది. నిజానికి ఈ దృక్పథాన్ని స్థాపించే కర్తవ్యం మనం చారుమజుందార్ నుండి నేర్చుకోవాలి, చారుమజుందార్ యొక్క philosophical contribution towards Indian revolution అనేది dialectical monism (గతితార్కిక అద్వైతం), దీన్నే మనం అవగాహన చేసుకోవాలి చిత్తశుద్ధిగా ఆచరించాలి Materialistic dialectical monismని స్థాపించాలి.

ఈ విధంగా materialistic dialectical monistic approach పై ఆధారపడే మన భారత విప్లవ వ్యూహాన్ని దీర్ఘకాలిక ప్రజా యుద్ధా పంథాగా నిర్దేశించుకోవడం జరిగింది. ఈ వ్యూహం మొత్తం భారతదేశ విప్లవ వ్యూహంగా ఉంటుంది. అందుకే గ్రామాలను విముక్తం చేస్తూ పట్టణాలను విముక్తం చేసుకుంటూ సాగుతాము. అందుకే మన అవగాహనలో గ్రామాలల్లో విముక్తి ప్రాంతాలు ఏర్పడి

మౌళికంగా శత్రువుపై విజయంతో స్థాపించిన బేస్ ఏరియాస్ ద్వారా ముందుకు సాగుతున్నప్పుడు పట్టణాలల్లో ఉధృతమైన పోరాటాలు సాగడానికి అవకాశం ఉంటది-ఉన్నది కూడా. ఐతే ఈ పట్టణాలల్లో ముందుకు వచ్చే ఉద్యమాల స్వభావం దీర్ఘకాలిక ప్రజా యుద్ధ పంథాకి అనుగుణంగానే సాగుతుంది. అయితే ఆ విధమైన స్వభావాన్ని సంతరించుకోవడంలో మనం పరిగణించేది ఏమంటే మౌళిక వైరుధ్యాల (ఎత్తుగడల వర్గపోరాటాలు) ఘర్షణ యొక్క అంశంగానే చూస్తాము. అయితే ఈ మౌళిక వైరుధ్యాల ఘర్షణ అనివార్యంగా ప్రధాన వైరుధ్యం యొక్క పరిష్కార స్వభావాన్ని సంపూర్తిగా కలిగియుంటూ ప్రతిఫలిస్తాయి. అందుకే మౌళిక వైరుధ్యాల యొక్క పరిష్కారంలో ప్రధాన వైరుధ్యాన్ని (వ్యూహాత్మక వర్గపోరాటం) పరిగణిస్తూ సాగుతాము. అంతమాత్రాన మౌళిక వైరుధ్యాలు నిర్లక్ష్యం కాబడవు అవి మొత్తం ప్రధాన వైరుధ్యపు పరిష్కారంలో చలనం వహిస్తూ విభిన్న వర్గ పోరాటాల నిర్మాణం-రూపాలు సంతరించుకుంటాయి, ఈ వర్గ పోరాటాలు వాటంతటవిగా సాగేవి కానటువంటి స్థితి కలిగినవిగా ఉంటాయి ఈ వర్గపోరాటాలు వాటంతటవే కాకుండా ప్రధాన వైరుధ్యంతో మధ్యవర్తిత్వం కలిగి ఉంటాయని పరిగణించాలి.

## (III)

### దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం:

"భారతదేశ నిర్దిష్ట పరిస్థితులకు ఈ యుద్ధ వ్యూహాన్ని అన్వయించే సందర్భంగా గ్రామాలల్లో ప్రజాయుద్ధం మొదలైనప్పుడు పట్టణాలు ఊరకనే వుండజాలవని, ప్రజా యుద్ధంలో గ్రామాలు పట్టణాలు విభజించకుండా ఒకటిగానే ఉంటాయని గుర్తించాలి''

- చారు మజుందార్, నవంబరు 7, 1970.

అందుకే ప్రజా యుద్ధంలో సాయుధ పోరాటం-ప్రజా పోరాటాలు ఒకటిగానే ఉంటాయని గ్రహించాలి. అందుకే విభిన్న వర్గ పోరాటాల రూపాలు-నిర్మాణాలు అనివార్యంగా ప్రజా యుద్ధ పంథా కలిగిన రాజకీయాధికార హస్తగతపు దృక్పథం-ఆచరణలుగా ఉండటంగా చూడాలి. ఆ యొక్క దృక్పథంతోనే మనం ప్రజా పోరాటాల విభిన్నత్వాన్ని అవగాహన చేసుకోవాలి-నిర్మించాలి. అందుకే దీర్ఘకాలిక ప్రజా యుద్ధం అనివార్యంగా దీర్ఘకాలిక ప్రజా ఉద్యమాన్ని అభివృద్ధి పరుస్తుంది.

భారతదేశం లాంటి వ్యవసాయాదారిత సమాజంలో అభివృద్ధి సమాంతరంగా రెండు పార్శ్వాలల్లో జరుగుతుంది-ఒకటి భూ సంస్కరణలు, ఉత్పత్తి పరికరాల పంపిణీ, యాజమాన్య శ్రమ-మారకపు సంబంధాల్లో మార్పు, విత్తనాలు ఎరువుల పంపకం, నీటి సౌకర్యాలు, మార్కెటింగ్ వసతి, రోడ్ల నిర్మాణం విద్యుత్తు సరఫరా, వ్యవసాయాధారిత పరిశ్రమల స్థాపనతో పాటుగా రెండవది సరైన గృహ కల్పన త్రాగు నీరు, డ్రైనేజీ వసతులు, మంచినీళ్ళ అవకాశాలు, ఆరోగ్య వసతులు, విద్యా-రవాణా సదుపాయాలు మొదలైనవిగా ఉంటాయి. ఈ అభివృద్ధి మొత్తానికి భూ పంపకం కీలక పాత్ర పోషిస్తుంది, మన దేశంలో భూపంపకం రెండు పార్శ్వాల్లో జరగాలి-ఒకటి సంపూర్ణ వ్యవసాయాధారిత వ్యవస్థలో భూ పంపిణి, రెండు వ్యవసాయం ప్రధానం కాని ప్రాంతాల్లో అలాగే గిరిజన తెగలను వ్యవసాయాధారిత పునాదిపైకి తీసుకురావడంకై భూ పంపిణి ఐతే అభివృద్ధి పథకాలను అమలు చేసే క్రమములో వైరుధ్యం యొక్క పరిష్కారం ఒక దశకు చేరుకున్నప్పుడు వైరుధ్యం యొక్క మొత్తమే పరిష్కరించబడిందనే స్థితిలోకి జారుకుంటూ అభివృద్ధిని పరిమితాంశముగా మార్చడం జరుగుతుంది. ఫలితంగా అభివృద్ధి యొక్క నిర్వచనం పూర్తిగా మారిపోతుంది. అందుకే భూ పంపిణి అనే యాజమాన్య సంబంధాల్లో మార్పుతో మాత్రమే కాకుండా శ్రమ-పంపిణీ సంబంధాలల్లో ఈ మార్పును సుసంపన్నం చేస్తూ ప్రాంతాలవారీగా రాజకీయాధికారాన్ని స్థాపిస్తూ సాగుతాము.

భారత దేశంలో సాధించాల్సినది నూతన ప్రజాస్వామిక విప్లవం. ఈ నూతన ప్రజాస్వామిక విప్లవం కార్మిక వర్గ నియంతృత్వంలో చలామణి అయ్యే కార్మిక వర్గ ప్రజాస్వామ్యపు ఒకానొక దశగా అర్థం చేసుకోవాలి. ఇటీవల కార్మిక ఉద్యమాలను-ప్రజా ఉద్యమాలను అర్థం చేసుకోవడంలో మనం లోటుపాట్లకు గురికావడం జరుగుతున్నది. దీనికి కారణం దీర్ఘకాలిక ప్రజా యుద్ధాన్ని సరిగ్గా అవగాహన చేసుకోకపోవడమని గమనించాలి. భారతదేశ నిర్దిష్ట పరిస్థితులలో దీర్ఘకాలిక ప్రజా యుద్ధం దీర్ఘకాలిక ప్రజా ఉద్యమాన్ని అభివృద్ధి పరిస్తుందనే అవగాహన నేడు మనకు అవసరం. దీర్ఘకాలిక ప్రజా యుద్ధంలో వ్యూహాత్మక ప్రతిఘటన వ్యూహాత్మక ప్రజా ఉద్యమాలను ఆధారం చేసుకుంటూ అభివృద్ధి చెందుతుంది, అంతేకాకుండా వ్యూహాత్మక సమతుల్యానికి అభివృద్ధి చెందే క్రమంలోని ప్రజాయుద్ధానికి ప్రజా ఉద్యమం విస్తృతి-విశాలంతో పాటుగా గుణాత్మక గెంతుగా లక్ష్యాలను నిర్దేశించుకుంటూ ప్రజా యుద్ధపు సమతుల్యపు స్థితికి చేరవేసే తన వంతు పాత్రను నిర్వహిస్తుంది, ఇది పరస్పరతా సూత్రం కలిగినది. ఇక వ్యూహాత్మక ఎదురుదాడికి సంబంధించిన ప్రజా యుద్ధ పంథా ప్రజా ఉద్యమ స్థితి సమన్వయంగా అంతఃసంబంధంగా పెనవేసుకుపోయి సాగుతాయి. ఇక రెండింటినీ విడదీయలేము, పక్షం-వైరిపక్షంగా ఈ రెండిటి మధ్య ఐక్యత-ఘర్షణ సంశ్లేషణగా మార్పు చెందుతుందనే సూత్రంగా వ్యూహాత్మక ఎదురుదాడి (ప్రజా యుద్ధం-ప్రజా ఉద్యమం) అనేది సంశ్లేషణ. కావున ఈ

అవగాహనతో మనం ముందుకు సాగాల్సిన అవసరం ఉన్నది. ఉద్యమించాల్సిన అవసరం ఉన్నది. ఇకపోతే ప్రజా యుద్ధ పంథా మౌళికంగా మావో ప్రతిపాదించిన దీర్ఘకాలిక ప్రజా యుద్ధ పంథా మూడు దశల్లో సాగుతుంది

1. సాయుధ ప్రతిఘటన దశ
2. సాయుధ సమతుల్య దశ
3. సాయుధ ఎదురుదాడి దశ

ఈ మూడు దశలు మౌళికంగా మార్క్సిజాన్ని సంపూర్ణ అన్వయాత్మక స్థితిలో ఆచరించిన కర్తవ్యాన్ని కలిగియున్నదని అర్థం చేసుకోవాలి. ఈ దశల ఏకత్వంగానే దీర్ఘకాలిక ప్రజాఉద్యమం అభివృద్ధి చెందుతుంది. ఈ దశలను ఇపుడు పరిశీలిద్దాం.

**1. సత్త తనలో తాను:**

సత్త తనలో తాను అనేదాన్ని మనం సాయుధ ప్రతిఘటన దశ క్రింద అవగాహన చేసుకోవాలి. ఈ సాయుధ ప్రతిఘటన సత్త తనలో తానుగా ఉంటుంది. ఈ సాయుధ ప్రతిఘటన అనేది ఆయా విప్లవానికి ఆయా దేశ స్థల కాల విప్లవానికి పునాదియగు/పునాది వ్యూహమగు ప్రధాన వర్గ వైరుధ్యపు ఉద్యమాలపై ఆధారపడి వృద్ధి చెందుతుంది. ఈ స్థితిలో ప్రాంతాలవారిగా నిర్దిష్ట స్థల-కాలాల్లోని పోరాటంగా-పోరుగా అభివృద్ధి చెంది సాయుధ ప్రతిఘటన స్థాయిని

అందుకోవడం జరుగుతుంది. ఈ స్థితిలో రాజకీయాధికార లక్ష్యం హస్తగతం చేసుకునే స్థితి ఉండదు. అందుకు కారణం ప్రజా ఉద్యమం యొక్క విశాల ఐక్యత-సమన్వయం-విస్తృతి ఏర్పడని స్థితి/ వాతావరణం.

**2. సత్త తన కొరకు తాను:**

సత్త తన కొరకు తాను అనే దశని సాయుధ సమతుల్య స్థితిగా పరిగణించాలి. ఈ స్థితిలో సాయుధ పోరాటం పునాదిగా ప్రజా ఉద్యమాలను నిర్మాణాత్మక స్థాయిలో అభివృద్ధి చేసుకుంటూ రాజకీయ సమీకరణ మరియు ఆయుధాల సమీకరణ చేసుకుంటూ శత్రువుపై ఎత్తుగడల రూపంలో నిర్దిష్టమైన దాడులు నిర్వహిస్తూ అభివృద్ధి చెందుతాము. ప్రజా ఉద్యమాలు సాయుధ పోరాటాన్ని ప్రభావించుకుంటూ విశాల ఐక్యత-విస్తృతి ఏర్పర్చుకునే కార్యాచరణగా ఉంటుంది. ఇక్కడ విప్లవ వర్గ పోరాటం అనగా సాయుధ పోరాటం ప్రజా ఉద్యమాలు సమాన స్థాయిలో అనగా రాజకీయ అధికార లక్ష్యం-స్వాధీనం అనే స్పష్టతకు వృద్ధి చెందడానికి ఒకదానిపై ఒకటి ప్రతిఫలించుకుంటూ సమన్వయం సాధించే భావజాల ఐక్యత-ఆచరణగా అభివృద్ధి అవ్వడం.

**3. సత్త మన కొరకు:**

సత్త మన కొరకు అనగా సాయుధ ఎదురుదాడి దశగా పరిగణించాలి. ఈ సాయుధ ఎదురు దాడిలో ఇక ఉద్యమాలు

అలాగే సాయుధ పోరాటం విడదీయ లేని స్థితి ఏర్పడుతుంది. ప్రజా ఉద్యమాలు ఇకపై సాయుధ పోరాటంగా, సాయుధ పోరాటం ఇక ప్రజా ఉద్యమంగా సాగుతుంది. ఈ ప్రక్రియ పాంతాలవారీగా రాజకీయ అధికారాన్ని స్వాధీనం చేసుకునే స్థితిగా అభివృద్ధి చెందుతుంది.

ఇకపోతే ప్రజా ఉద్యమాలు కూడా మూడు దశల గుండా సాగుతుందని అవగాహన చేసుకోవాలి. ప్రజా ఉద్యమాల తిరోగమన-సమతుల్య-ఎదురుదాడి దశలు సాయుధ పోరాటం దిశగా-అభివృద్ధి-సమన్వయం-సమస్థాయిగా సాగడం జరుగుతుంది.

ఈనాడు దీర్ఘకాలిక ప్రజా యుద్ధ పంథా అనివార్యంగా దీర్ఘకాలిక ప్రజా ఉద్యమాన్ని అభివృద్ధి పరుస్తుంది. అందుకే ఈ ప్రజా ఉద్యమం అనివార్యంగా మూడు దశల గుండా ప్రజా యుద్ధ పంథాకు ఉపయుక్తంగా ప్రతిఫలిస్తాయి. ఆ దశలు ఏమనగా

1) ప్రజా ఉద్యమాల ప్రతిఘటన దశ
2) ప్రజా ఉద్యమాల సమతుల్య దశ
3) ప్రజా ఉద్యమాల ఎదురుదాడి దశ

**1) ప్రజా ఉద్యమాల ప్రతిఘటన దశ:**

ప్రజా ఉద్యమాల ప్రతిఘటన దశ లేదా సత్త తనలో తాను అనగా ప్రజా ఉద్యమాలు సంపూర్ణంగా ఆర్థిక హక్కులు-ఆర్థిక

పోరాటాల దిశగా తమ తక్షణ హక్కుల కోసం జరిగే పోరాటాలుగా అవగాహన చేసుకోవాలి. ఆ ప్రతిఘటన దశలో సైతం ఉద్యమాలు నిర్దిష్ట మిలిటెంట్ పోరాట స్థాయిలో అభివృద్ధి చెందవచ్చు. దీన్నే మనం ఆత్మరక్షణ గెరిల్లా పోరాటాలుగా అభివృద్ధి అని వ్యవహరించడం జరుగుతుంది. అయితే ఈ దశ కేవలం నిర్దిష్ట-స్థల-కాలాల్లో ఆయా రూపాల్లో ఆయా కార్యరంగంలో అభివృద్ధి చెందవచ్చు. ఈ దిశగా సాగడానికి కారణమైన సామాన్య రాజకీయ డిమాండ్ల-హక్కుల రూపంలో సాగే వాతావరణం కారణం అవుతుంది. ఫలితంగా ఈ దశ సాయుధ ప్రతిఘటన స్థితికి ఒకానొక ఆధారంగా ఏర్పడుతుంది. అందుకు వ్యూహాత్మక ప్రజా ఉద్యమాలుగా ఆయా వ్యూహాత్మక వర్గ పోరాటాలకి ఆధారం కూడా, కీలకమైనది కూడా. ఐతే ఈ వ్యూహాత్మక వర్గ పోరాటాలని నిర్మిస్తూ సాయుధ ప్రతిఘటన స్థితిని అభివృద్ధి చేసుకోవచ్చు. దీనంతటికీ రాజకీయాధికార హస్తగతం యొక్క ఆధిక్య స్థితిలోనే ప్రజా యుద్ధ పంథా మొత్తం అభివృద్ధి అవుతుంది.

**2) ప్రజా ఉద్యమాల సమతుల్య దశ:**

సత్త తన కొరకు తానుగా ఉన్న ఈ దశలో ప్రజా ఉద్యమాల మధ్య సంపూర్ణ ఐక్యత-విస్తృతి-విశాలం ఏర్పడుతుంది. ఈ విశాలం విస్తృతి సాయుధ పోరాట విస్తృతి-విశాలం యొక్క గుణాత్మక పరిస్థితిలో భాగంగా వృద్ధి చెందుతుంది. ఇలా సాగడంలో సాయుధ పోరాట పార్టీ నిర్మాణాత్మక ప్రజా ఉద్యమాలను అభివృద్ధి

చేస్తుంది. ఈ నిర్మాణాత్మకత ఆర్థిక హక్కులు-తక్షణ కోర్కెలు, సామాన్య రాజకీయ హక్కుల పోరాటాలను ఉధృతం చేయడంతో పాటుగా అత్యంత స్పష్టంగా వాటిపై రాజకీయాధికార లక్ష్యపు ఐక్యతను నిర్దేశించడంగా సాగుతుంది. సైద్ధాంతిక సమన్వయంగా పెంపొందించే కర్తవ్యాన్ని సాగిస్తుంది. ఇక్కడ ప్రజా ఉద్యమం కేవలం ఆయా వర్గాల సామాన్య హక్కులు-కోర్కెలపై మాత్రమే సాగే ఉద్యమంపై ఆధారపడదు. రాజకీయ అధికార హస్తగతం లక్ష్యంగా సాగే భావజాలంగా వృద్ధి చేసే లక్ష్యంగా సాగుతుంది. అందుకే యాదృచ్ఛికమైనది కాకుండా ఆవశ్యక-అవసరంగా సాగేదిగా ఉంటుంది. నిజానికి ఈ దశలోనే మన విప్లవ కమ్యూనిస్టులు వెనకబడియున్నారు. ఈ దశపు ప్రజా ఉద్యమాన్ని అభివృద్ధి చేయడం ద్వారానే మనం సాయుధ పోరాటం-ప్రజా ఉద్యమం సమతుల్య స్థితి ఏర్పడుతుంది. ఈ దిశగా సాగడానికి ప్రజా ఉద్యమం 1) వర్గ సంఘాలు 2) శ్రేణులు పై ఆధారపడి ఉద్యమాన్ని నడపాలి.

**1) వర్గ సంఘాలు** అనగా యాజమాన్యం/ప్రభుత్వం క్రింద నేరుగా శ్రమ చేసే/శ్రమ శక్తిని దారబోసే రంగాల్లో ఏర్పర్చే సంఘాలు.

**2) శ్రేణులు** అనగా విద్యార్థి, మహిళ, రచయితలు మొదలగు వర్గాల సంఘాలను శ్రేణులుగా ప్రస్తావిస్తాము. ఈ సంఘాలు వర్గ సంఘాల చైతన్యపు ప్రతిఫలనంగా తమ రంగాలల్లో నిర్దిష్ట పోరాట చైతన్యంగా అభివృద్ధి పరుచుకుని సాగడం జరుగుతూ విశాల వర్గ పోరాట నేపథ్యంలో భాగం అవ్వాలి.

ఇక ప్రజా ఉద్యమాల తిరోగమన దశలో ఆర్థిక-తక్షణ-రాజకీయ సామాన్య హక్కుల పోరాటం పూర్తిగా యాదృచ్ఛికంగా ఆయా స్థల-కాలం అనుగుణంగా సాగుతుందేమోగానీ ప్రజా ఉద్యమాల సమతుల్య దశలో సాయుధ పోరాటం ఒక నిర్మాణాత్మక ఆవశ్యకంగా ఆర్థిక-తక్షణ-సామాన్య రాజకీయ హక్కులను నిర్మిస్తూ వాటిపై రాజకీయ అధికార లక్ష్యాన్ని-భావజాలాన్ని సమన్వయం వహిస్తుంది. అందుకోసం వర్గ సంఘాలను అభివృద్ధిపరుస్తూ అత్యున్నత పోరాట చైతన్యాన్ని శ్రేణుల వర్గ సంఘాలల్లో ప్రసరింప చేస్తుంది. ఆ విధంగా రాజకీయ అధికారం హస్తగతం వైపుకు సాయుధ పోరుతో ఐక్యపరుస్తుంది.

### 3) ప్రజా ఉద్యమాల ఎదురుదాడి దశ:

సత్త మన కొరకు అయినా ఈ ఎదురుదాడి దశ అనేది కేవలం ఆర్థిక-తక్షణ-సామాన్య రాజకీయ హక్కుల పోరాటం కాదు అది ఒక సంపూర్ణ రాజకీయ లక్ష్యమైన రాజకీయాధికార హస్తగతం అనే లక్ష్యమే ఈ ఎదురు దాడి దశకు నడిపిస్తుంది. ఈ దశగా సాయుధ పోరాటాన్ని ప్రజా ఉద్యమాన్ని విడదీయలేము. సాయుధ ఎదురుదాడి మాత్రమే అంతిమ లక్ష్యంగా, అంతిమ రూపంగా సాగే లక్ష్యంగా పోరాటం ఉంటుంది. ఇకపై ఈ పోరాటం ఒక విశాల-విస్తృతం ప్రాంతాలవారీ అధికారం అభివృద్ధి, రాజకీయ అధికారం హస్తగతం జరుగుతుంది.

ఇదంతా దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం అనేది రెండు రూపాలల్లో సాగుతుంది.

1) **ప్రజా ఉద్యమం** అనేది ప్రజా సంఘాలైన వర్గ/ శ్రేణుల వర్గ సంఘాల నిర్మాణాలు, నిర్మాణాత్మకమైన పోరాటాలు- రాజకీయాధికార లక్ష్యం దిశగా సాగించడం-సాయుధ పోరాటం- ప్రజా ఉద్యమాల ఐక్యత సమన్వయం-అభివృద్ధి.

**2) సైద్ధాంతిక పోరాటం:**

"The success of the struggle is depending on how far we can popularize the politics of armed struggle through propaganda of it among the masses" - Charu Mazumdar

సైద్ధాంతిక వర్గపోరాటం అయిన దీర్ఘకాలిక ప్రజా పోరాటం యొక్క రూపాన్ని చర్చించడం కీలకమైనది. దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం యొక్క సైద్ధాంతిక పోరాటం విభిన్నమైన అన్యవర్గ ధోరణులకు వ్యతిరేకంగా మాత్రమే సాగించడం కాదు, అది ఒక తీవ్రమైన తాత్విక వర్గ పోరాటం. ఉత్పత్తి విధానం అనగా ఉత్పత్తి శక్తులు- ఉత్పత్తి సంబంధాలు. ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తి శక్తులకనుగుణంగా ఉంటూ వాటిని మెరుగుపరుస్తాయి. ఉత్పత్తి శక్తులు ఉత్పత్తి సంబంధాలను అభివృద్ధి పరుస్తాయి ప్రతిఫలనంగా ఉపరితల అంశాలు అభివృద్ధి చెందుతాయి. ఉత్పత్తి సంబంధపు అనగా ఉత్పత్తి

యాజమాన్యం-శ్రమ-పంపిణీ సంబంధాలల్లో మార్పు ఉపరితలంలో మార్పులను నిర్ణయిస్తుంది. ఉపరితలం మొత్తం ఉత్పత్తి విధానాన్ని ప్రతిఫలిస్తుంది. ఉత్పత్తి విధానం- ఉపరితలాల మధ్య పరస్పర ఆధార వ్యతిరేక తత్వముంటుంది. రాజ్యం ప్రధాన వైరుధ్యంగా ఉంటూ ఉత్పత్తి విధానాన్ని ప్రతిఫలిస్తుంది. ఈ ప్రధాన వైరుధ్యం అప్రధాన ఉపరితల వైరుధ్యాలను అదుపు చేస్తుంది, చలనంలో ఉండేట్లు చేస్తుంది- ఇవి పరస్పరం ప్రభావించుకుంటాయి. ఉత్పత్తి శక్తుల- ఉత్పత్తి పంపిణీ- మారకాల అభివృద్ధి అనివార్యంగా శ్రమ విభజనను అభివృద్ధి పరుస్తాయి- ఫలితంగా ఉపరితలపు ప్రధాన వైరుధ్యం వర్గ పోరాటానికి (వైషమ్య స్థితి) గురై అప్రధానంశాలను కదిలిస్తూ వాటిని మెరుగుపడేట్లు చేస్తుంది లేదా అప్రధానంశాలే వర్గపోరాటానికి (వైషమ్య స్థితి) గురై ప్రధాన వైరుధ్యాన్ని మార్పుకు గురిచేయవచ్చు. కావున భారతీయ తాత్వికత విప్లవకార్యాచరణకు గురికావడం తక్షణ ఆవశ్యకత, అయితే ఈ ఆస్తి-శ్రమ-పంపిణీ సంబంధాలల్లోని మార్పులు అనివార్యంగా విప్లవాత్మకతను దాని ప్రభావాలన్నింటా-అంతటా వ్యాపింప చేసే వాతావరణం ఉంటుంది-ఉండాలి. కావున మన దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం సైద్ధాంతిక రంగ ఉద్యమాన్ని సంపూర్ణమైన దీర్ఘకాలిక ప్రజా యుద్ధం పునాదిగా అభివృద్ధి-విస్తృతి-విశాలంగా సాగించే తక్షణ లక్ష్యంగా ముందుకు సాగుతుంది. ఈ దిశగా మన కార్యాచరణ సాగడం ముఖ్యం.

మన విప్లవ పార్టీ యొక్క కార్యాచరణ-అనుభవం మాత్రమే తన దీర్ఘకాలిక ఆచరణ నుండి సిద్ధాంత రంగంలో ఉన్నతంగావించే దృక్పథం కలిగియుందని ఎల్లవేలలా రుజువు అవుతూనే ఉంది. మన భారతీయ పరిస్థితులకు మార్క్సిజం-లెనినిజం-మావోయిజం యొక్క సిద్ధాంత అన్వయంతో జరుగుతున్న పోరాటం మనకు అందిస్తున్న అనుభవం-అవగాహన దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం. దీర్ఘకాలిక ప్రజా యుద్ధం దీర్ఘకాలిక ప్రజా ఉద్యమాన్ని-దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం దీర్ఘకాలిక ప్రజా యుద్ధాన్ని అభివృద్ధి పరుస్తుందని అవగాహన చేసుకోవాలి. ఇదే మన భారతీయ విప్లవ ప్రత్యేక స్థల-కాల విప్లవ కార్యచరణగా అభివృద్ధి చెందిన వాస్తవం. కావున మన వంతుగా మన సైద్ధాంతిక అవగాహనను పరిపుష్టి చేసుకొని భారతీయ విప్లవాన్ని విజయవంతం వహించే దిశగా సాగాల్సిన అవసరం ఉన్నది. అయితే రాజకీయాధికార హస్తగతం అనే మౌళిక సమస్య ప్రజా ఉద్యమాల దశలల్లో కీలకంగా ఉంటూనే అదే విధంగా దాని ఆధిక్యత ప్రధానంగా ప్రజా ఉద్యమాలు అభివృద్ధి-పెంపుదలల సమస్యగా ముందుకు సాగడం అనేది కీలకంగా మారుతున్న వ్యవహారం. అందుకే రాజకీయాధికారం హస్తగతం అనే కర్తవ్యం ప్రధానంగా ప్రాంతాలవారీగా స్వాధీనపు సమస్యగా ముందుకు వస్తుంది. అందుకే వర్గపరిశీలనను ప్రాథమికమైన అంశంగా ప్రతిష్ఠించడం దాని ఆధారంగా ప్రాంతాలవారీగా రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవడం అనే

కర్తవ్యాన్ని పూరించడంగా మారుతుంది. దీన్నంతా కాలదన్ని ఈనాటి రివిజనిస్టు నాయకత్వం.

"leadership is refusing to take the responsibility of the democratic revolution of india and as result of that they are resorting to the cunning tactics of modern revisionism, that is the path of being revolutionaries in words and an appendage of the bourgeoisie in deeds"

- charu mazumdar

ఈనాడు దీర్ఘకాలిక ప్రజా యుద్ధం కీలకంగా దీర్ఘకాలిక ప్రజా ఉద్యమాలని అభివృద్ధి పరుస్తుంది. ఇందుకు ఏవిధమైన మినహాయింపులు-రాజీలు లేవనే గ్రహించాలి. ఐతే దీనంతటికీ పునాది "the unity of peasants and workers can grow only on the basis of class struggle" - Charu Mazumdar

అందుకే దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం-దీర్ఘకాలిక ప్రజా యుద్ధపు వర్గపోరాటమే కార్మిక-కర్షక ఐక్యతకు పునాది, అది మాత్రమే materialistic dialectical monistic approach అని గ్రహిద్దాం. ఈ ఐక్యత మౌళికంగా వ్యూహాత్మక పంథా యొక్క ఆచరణాత్మకత ద్వారా మాత్రమే ముందుకు సాగుతూ విస్తృతి అవ్వగలదు. కావున నేడు దీర్ఘకాలిక ప్రజా యుద్ధం పునాదిగా దీర్ఘకాలిక ప్రజా ఉద్యమాన్ని అలాగే దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం నుండి దీర్ఘకాలిక

ప్రజా యుద్ధాన్ని అభివృద్ధి చేసుకోవాలి. సాయుధ సమతుల్య స్థాయిని ప్రజా ఉద్యమ సమతుల్య స్థాయికి అభివృద్ధి పరుస్తూ ఒకదానిపై ఒకటి ప్రతిఫలించుకుంటూ ఎదురుదాడి స్థితికి అభివృద్ధి చెందాలి. మార్క్సిజం-లెనినిజం-మావోయిజం పునాదిగా నిర్దిష్ట పరిస్థితులల్లో నిర్దిష్ట కార్యాచరణగా మన సిద్ధాంత-రాజకీయ కార్యాచరణను అమలు చేయాలి.

# అనుబంధం

ఇకపోతే ప్రజా ఉద్యమం-ప్రజా సంఘాల అన్యవర్గ ధోరణులకు కారణమైన కొన్ని కీలకమైన భావజాల, సైద్ధాంతిక అంశాలను పరిశీలిద్దాం, అలాగే వాటిపై నిరంతరం పోరాడాల్సిన అవసరం నేడు ఆవశ్యకంగా భావిస్తూ ఒక ప్రధానమైన ఉద్యమాన్ని నిర్వహించాలి. ఆ ఉద్యమమే దీర్ఘకాలిక ప్రజా ఉద్యమం, ప్రజా ఉద్యమం యొక్క వ్యూహం-ఎత్తుగడలు దీర్ఘకాలిక ప్రజా యుద్ధంలో భాగంగా దీర్ఘకాలిక ప్రజా ఉద్యమపు దృక్పథంతో, ఆచరణతో సాగుతేనే అన్యవర్గ ధోరణులకు-తాత్వికతలకు పరిష్కారము దొరుకుతుంది.

**అస్తిత్వవాదం:**

ఎంపిక అనేది ఆధునిక మనిషికి కీలకమైన అంశంగా మారడానికి అభివృద్ధిచెందిన-చెందుతున్న ఉత్పత్తి శక్తులు-శ్రమ విభజన ఫలితమని చెప్పుకోవాలి. అయితే స్వీయాత్మక భావవాద దృక్పథ భూమికగా మానవ ఎంపికను తాత్వీకరిస్తూ ఇదైనా అదైనా అనేదే నిర్ణయాత్మకమైనదని తేల్చడంగా అస్థిత్వవాదం బయలుదేరింది. అలాగే ఇచ్ఛాశక్తి మాత్రమే తనకొరకు తానుగా మనిషిని నిలబెడుతుందని కొందరు వాదిస్తే, అనుభవమనే చైతన్య స్రవంతి

యొక్క నిత్యపరివర్తన మాత్రమే సత్యమని మరికొందరు భావించారు, ఐతే ఈ వాదాలన్నింటికీ పరాకాష్ట తనకొరకు తాను అయిన అస్తిత్వం (మానవ చైతన్యం-శూన్యత) తనలోతానైన అస్తిత్వం (అచేతన వస్తువులు) ఇతరులకొరకైన అస్తిత్వంగా అస్తిత్వాన్ని సిద్ధాంతీకరిస్తూ అస్తిత్వవాదాన్ని స్థాపించారు. ఈ నేపథ్యంగా అస్తిత్వవాద సాహిత్యంలో ఇతరులకొరకైన అంశాలపై స్పందించడాన్ని గమనించవచ్చు అంతేకానీ ఆ స్పందనను ఆధారం చేసుకుని భౌతికవాద గతితర్క తాత్వికతే వారి దృక్పథమని నిర్ణయించలేము. మానవుని భావాత్మక నిర్ణయమే అస్తిత్వం అనే ముష్టి మహా వాదంగా చలామణి అవుతూ ఈ రోజు మన సంఘాలకు పట్టిన ఆత్మిక భూతం.

**ఆధునికానంతరవాదం:**

ఈ ఆధునికానంతరవాదం ప్రధానంగా సత్యాన్ని సంపూర్ణంగా తెలుసుకోజాలమని వాదిస్తుంది. వస్తుగత సత్యం-కారణ, కార్యాలు, విలువలు ఉండవని వక్కానిస్తుంది. చారిత్రకతపై, మానవుని హేతుబద్ధతపై ఏకపక్ష దాడిగా ఎదిగిన వాదం. ఆధునికానంతర వాదం ప్రధానంగా భావజాలాత్మక వాదంతో సరిగ్గా సత్యాన్ని దాని వస్తుగత స్వభావాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోవడం సాధ్యపడదని అభిప్రాయపడుతూ ప్రతీ వాదంలో ప్రతిపక్షం ఏర్పడుతుందని ఈ ప్రతిపక్షం అనివార్యంగా ఆధిపత్య పక్షంతో అణచబడే స్వభావం ఉంటుందని వాదిస్తూ ఈ ప్రతిపక్షం అనివార్యంగా

సమాజంలో మతం, జాతీయత, ప్రాంతీయత, కుటుంబం, జెండర్, కులవాదం మొదలగు అంశాలను ముందుపెడుతూ శాస్త్రీయతతో లేదా ఒకానొక సిద్ధాంత అవగాహనతో సాధించలేనిదని వాదిస్తుంది.

"post modernists only want to take part in the struggles based on issues of various section of the society. They think that these struggles develop through deconstruction of hegemonistic discourses. And post modernists like to play a conscious role in these struggles with the aim of extending the area of Democracy......"

**సత్యానంతరవాదం:**

సత్య కాలం అంతరించింది, సత్యంతో వ్యవహరించడం వృధా, సత్యం వెనక్కి వెళ్ళిపోయింది. సత్యాన్ని తెలుసుకునే కార్యకారణాలు లేవని కేవలం మానవుల ఆవేశాలు-భావోద్రేకాలు-అభిప్రాయాలు మాత్రమే చలామణి అయ్యే ప్రధాన వ్యవహారంగా సాగడం. దీనితో కల్పిత అద్భుత ఉద్రేక కథనాలు-గాథలు ప్రభావితం చేసే సన్నివేశం అలాగే సంపూర్ణంగా మానవుల మధ్య వ్యక్తిగత ఉద్రేక వ్యవహారాలే సంపూర్ణ సంబంధాల సమాహారంగా సాగే సన్నివేశం ఫలితంగా రాజకీయాలు భావోద్రేకాలు మరీ ముఖ్యంగా సమాజంలో మతం, జాతీయత, ప్రాంతీయత, కుటుంబం, జెండర్, కులవాదం మొదలగు అంశాలను ముందుపెడుతూ శాస్త్రీయతతో లేదా ఒకానొక

సిద్ధాంత అవగాహనతో సాధించలేనిదని వాదించే ఆధునికానంతర వాదానికి ఉపయుక్తంగా సాగుతుంది.

**వ్యక్తివాదం:**

వ్యక్తికి ప్రాధాన్యం అనగా వ్యక్తి తన ప్రయోజనాలకే ప్రాధాన్యం ఇచ్చే వాతావరణం కలిగి ఉండటం, అహం ప్రధానంగా సాగే వాదంగా ఉండటం, ఈ సర్వం అహం వాదంగా సాగే వ్యవహారంగా ఉంటూ వ్యక్తికి పెద్ద పీట వేస్తూ వ్యక్తి ఆవేశాలకు-ఉద్దేశాలకు ప్రాధాన్యతనిస్తుంది.

**అరాచకవాదం:**

అంతిమంగా రాజ్యం-రాజకీయ పాలనను నిరసించే ఒకానొక వాదంగా ముందుకు వచ్చింది. రాజ్యం-రాజకీయ పాలన కేవలం అణచివేతకు-ఆధిపత్యానికే తప్ప స్వేచ్ఛా, సమానత్వానికి ఉపకరణాలు కావని వాదిస్తూ రాజ్యమే లేని రాజకీయ పాలనే లేని సామాజిక అభివృద్ధిని చెబుతుంది. నిజానికి ఈ వాదం ఆధునికానంతరవాదంకి పితామహుడు-ప్రతీ రాజకీయ వ్యవస్థ ఆధిపత్యంగా భావించే స్థితిని ప్రచారం చేస్తుంది. నిజానికి ఈ వాదం రాజకీయ వ్యవస్థ యొక్క చారిత్రక పరిణామ అభివృద్ధిని గుర్తించని వాదంగా చలామణి అవుతుంది. ఈ అరాచకవాదం ప్రబలంగా సాగుతున్న వాతావరణం ఉన్నది. మన ప్రజా ఉద్యమాలల్లో ప్రజా సంఘాలల్లో కూడా కేవలం వ్యక్తుల సమస్యలు

లేదా సన్నివేశాలు-సంఘటనలకు ప్రతిస్పందనలే లేక కార్యక్రమాలే తప్ప ఒక రాజకీయ ఎజెండా లేని వాతావరణంలో సాగుతున్నాము.

**బూర్జువా సామరస్య ప్రజాస్వామికవాదం:**

"ప్రజాస్వామిక మూలాలు- దేశంలోని సామాజిక సంబంధాల్లో ఏ ప్రజల వల్లనైతే సమాజం ఏర్పడుతుందో ఆ ప్రజల మధ్య ఉండే సహజీవన తీరును అనుసరించి... ప్రశంసనీయమైన ప్రయోజకత్వం, సంక్షేమం పట్ల ఆకాంక్ష, ప్రజల పట్ల విధేయత, పరస్పర సానుభూతి, సహకారం..." -అంబేద్కర్.

ప్రజాస్వామిక మూలాలు- దేశంలోని సామాజిక సంబంధాల్లో ఏ ప్రజల వల్లనైతే సమాజం ఏర్పడుతుందో ఆ ప్రజల మధ్య ఉండే సహజీవన తీరును అనుసరించి సాగేదిగా అంబేద్కర్ గారు వివరించారు కానీ నిజానికి ఈ ప్రజల మధ్య ఉండే సహజీవనం రాజకీయార్థిక-సాంఘిక మూలాలపై ఆధారపడి ఉంటుంది. ఒకానొక సమాజంలోని ప్రజల మధ్య ఉత్పత్తి-శ్రమ-పంపిణీ సంబంధాల వ్యవహారంలో ఏర్పడే ఒకానొక దశ యొక్క సహకారపు తీరును ఆధారం చేసుకుని సాగే విధానం. అప్పుడు అనివార్యంగా ఈ ప్రజాస్వామ్యం ఉత్పత్తిపై యాజమాన్యం-ఆస్తి సంబంధాల యొక్క వాస్తవ ఆధారంగా సాగే ఒకానొక ప్రక్రియగా అవగాహన చేసుకోవాలి. అప్పుడు ప్రజాస్వామ్యం భూస్వామ్య ప్రజాస్వామ్యమా? బూర్జువా ప్రజాస్వామ్యమా? లేక కార్మికవర్గ ప్రజాస్వామ్యమా అనే అంశంగా

ప్రజాస్వామ్యాన్ని అవగాహన చేసుకోవాలి, కావున అంబేడ్కర్ చెప్పే ప్రజాస్వామ్యం ఒకానొక ప్రత్యేక సామాజిక రూపం యొక్క భావజాలయుత అంశమైనదిగా ఉండే ప్రజాస్వామ్య భావనగా అవగాహన చేసుకోవాలి. ఇకపోతే వ్యక్తి స్వేచ్ఛను ప్రధానం చేసే భారత రాజ్యాంగం యొక్క ప్రజాస్వామిక మూలాలు రోజు రోజుకూ దెబ్బతింటున్న వాతావరణం దేశవ్యాప్తంగా ఉన్నది. ప్రజలల్లో ఏర్పడుతున్న ఆర్థిక అభద్రత-సాంఘిక సమానత్వంలోని పరిధిలు అనివార్యంగా ఈ వ్యక్తి స్వేచ్ఛ యొక్క ప్రజాస్వామిక మూలల్లోనే వ్యాకులతను కలిగించే వాతావరణాన్ని గమనించవచ్చు. ఈ వ్యక్తి స్వేచ్ఛ స్థానంలో సాంఘిక సమానత్వ కృషిని సల్పే వాతావరణంలో మనం ఎదుర్కొనే సమస్యలు ఒకెత్తైతే- ఈ వ్యక్తి స్వేచ్ఛకు ఏర్పడుతున్న అడ్డంకిని ఎదుర్కొనే రిత్యా ప్రజాస్వామ్య మూలాలపై జరుగుతున్న దాడి అని, కేవలం వ్యక్తుల స్వేచ్ఛకి ప్రాధాన్యతని కలిగించే స్థితికి జారుకుంటూ బూర్జువా డిమాండ్లకు పరిమితం అయ్యే స్థితి నుండి సాంఘిక సమానత్వ భావన యొక్క పునాదికి రోజురోజుకూ దూరమవ్వడాన్ని అవగాహన చేసుకోవాలి. ఈ నేపథ్యంగా సంఘాల క్రియాత్మక మరియు భావజాలాత్మక వ్యవహారంలో ఏర్పడే అడ్డంకులను అవగాహన చేసుకోవాలి, ఫలితంగా సంఘాలల్లో ఏర్పడే వ్యక్తివాద మూల స్వభావాన్ని- వ్యక్తివాదానికి మూలమైన ఆధునికానంతరవాదాన్ని దాని యొక్క సత్యాంనంతరవాదపు మూర్ఖత్వాన్ని గమనించాలి.

### ఆర్థికవాదం:

హక్కులు-సంఘటనలపై సంఘటితమయ్యే సందర్భంగా ఉంటూ రాజకీయ పోరాటాలకు లేదా రాజకీయ కార్యకలాపాలకు దూరంగా ఉండే సేవా కార్యక్రమాల పద్ధతితో సాగడం. ఈ ఆర్థికవాదం ప్రధానంగా ఆయా వర్గాల లేదా కులాల సంక్షేమమే లేదా సౌకర్యాల హక్కులకే ఉద్యమాలు సాగించడంగా ఉండటం. ఆయా వర్గాల ఆర్థిక హక్కుల ప్రయోజనానికి ఉపయోగపడే వాతావరణంగా సంఘాలు ఉండటం.

### ప్రవృత్తివాదాన్ని వ్యతిరేకిద్దాం - సామాజిక స్పృహల సిద్ధాంతాన్ని ప్రతిష్టిద్దాం:

బాలగోపాల్ యొక్క ప్రవృత్తివాదం అనేది విప్లవ ప్రజా ఉద్యమంపై- ప్రజా సంఘాలపై తీవ్ర ప్రభావాన్ని కలిగించింది. ప్రవృత్తివాదం విభిన్న రూపాలల్లో తాత్విక నేపథ్యంగా ఆధిక్యత వహించి కుష్టు రోగంలా ప్రజా ఉద్యమాన్ని ధ్వంసం చేస్తుండటాన్ని మనం చూడవచ్చు. ఇకపోతే మానవ ఆచరణ ప్రతిఫలనాలు అనేవి సహజ ప్రతిచర్యలు అనగా జీవుల లక్షణాలు, అవి పరిసరాలతో తమను తాము ప్రతిఫలించడం మరియు పరిసరాల అవగాహనతో పాటుగా పరిసరాలను ప్రభావించడంగా చెప్పుకోవచ్చు. ఐతే ఈ సహజ ప్రతిచర్యల సాధారణీకరణ రూపాలుగా సహజాతాలను పరిగణించాల్సిన అవసరం ఉంటుంది. ఐతే ఈ సహజాతాలను

అనువంశికమైనవిగా, పుట్టుక రిత్యా సాగుతాయని గ్రహించాలి. ఐతే అంతమాత్రమే మానవ అచరణ ప్రతిఫలనాలుగా చెప్పుకోలేము మానవ ఆచరణ యొక్క పరిస్థితుల ప్రభావం, ప్రతిబింబాలు అనివార్యంగా ఆర్జిత ప్రతిచర్యలుగా సాగుతాయి కూడా. ~~ఈ~~ ఆర్జిత ప్రతిచర్యలు ఆయా పరిస్థితులలో మానవ ఆచరణ ఫలితంగా ఏర్పడే నిర్ధిష్ట లక్షణాలు, స్వభావాలుగా ఉంటాయి, వీటినే మనం సామాజిక స్పృహగా చెప్పుకోవాలి. ఇవి పరిస్థితుల, సందర్భానుసారంగా ప్రతిఫలిస్తాయి, ఇవి ఖచ్చితంగా ఆయా స్థల-కాలాల మానవ సామాజిక సంబంధాల నుండి ప్రతిబింబిస్తాయి. నాడీ వ్యవస్థ మరియూ వెన్నెముక కలిగిన జీవులలో సహజ ప్రతిచర్యల సహజాతాలతో సహా ఆర్జిత ప్రతిచర్యలకు గురికావడం జరుగుతుంది. ఐతే ఇంద్రియాల కార్యకలాపములు, వెన్నెముకలు కలిగిన జీవులలో జరిగే ప్రతిచర్యల ఫలితంగా ఏర్పడే లక్షణాలు, స్పందనలను ప్రథమ సంకేతాల వ్యవస్థగా చెప్పుకుంటారు. ఐతే అంతకుమించి మానవ చైతన్యం అనే మానవ సామాజిక ఆచరణ ఫలితం అనివార్యంగా సంభాషణలు, భాషల రూపంలో వ్యక్తం కావడాన్ని ద్వితీయ సంకేతాల వ్యవస్థగా చెప్పుకుంటారు. భాష రూపంలో ప్రేరణను కలిగించడంగా ఇది సాగుతుంది, ఇదే మానవుడిని ఇతర జీవాలను వేరు చేయగలుతుంది. కావున మానవుని ప్రతిఫలనాల ఆధారంగా సామాజిక స్పృహలు అభివృద్ధి కాసాగుతాయి. సామాజిక సహజాతాలు నిజానికి మానవుని

సుఖం, దుఃఖం, ఇచ్ఛా, ద్వేషం, ప్రయత్నం, బుద్ధి రూపాలలో వ్యక్తమవుతాయని చెప్పుకుంటాము, ఇవి భాషరూపంలో-సంభాషణల రూపంలో సైతం ప్రేరణగా ఉంటాయి. ఇవి మానవుని సామాజిక ప్రత్యేక రూపంలో ఆయా సందర్భానుసారంగా, కాలానుగతంగా సామాజికాంశాలుగా ప్రతిఫలిస్తాయి. ఉదాహరణగా మానవుని ఆకలిని తీసుకుంటే మానవుడి ఆకలి అత్యంత సహజమైనది, తాను జీవించడానికి ఉపయోగపడేది, కానీ అదే ఆకలిని ఏ రూపంలో (వివిధ కోరికలు) తీర్చుకుంటామనేదే సామాజిక స్పృహలుగా వ్యక్తమవుతాయి, దుఃఖాన్ని తీసుకుంటే మానవుడు భాదపడటంలో ఏ అంశాలకు కలుగుతుంది అనేది ఆయా సామాజిక రూపాల సామాజిక స్పృహలుగా వ్యక్తమవుతాయి. అందుకే మానవ సామాజిక సంబంధాల పరిస్థితుల ప్రభావం నుండి ఏర్పడే అంశాలను గ్రహించాలి. మానవ ఆచరణ అనే అంశాన్ని పరిశీలించాల్సిన, అవగాహన చేసుకోవాల్సిన పరిస్థితి నేడు అనివార్య స్థితిలోకి నెట్టబడ్డాము, నిజానికి ఈ పరిశీలన మానవ సమాజంలో ఏర్పడుతున్న మానసిక సంక్షోభాల నుండి మానసిక వికాసానికి తోడ్పడే అంశంగా ఉంటుంది. మానవ వ్యక్తిత్వ వికాసానికి మానవ సామాజిక ఆచరణ యొక్క సిద్ధాంతాన్ని ఆధారం చేసుకుని జరగాల్సిన శాస్త్రీయ పరిశోధన నేటి ఆవశ్యకత. అందుకై సామాజిక స్పృహలను గ్రహించి, గుర్తించాల్సిన అవసరం ఉంటుంది.

**కుటుంబంపై మార్క్సిస్టు అవగాహన:**

ఇప్పటి వరకూ స్త్రీ పురుషుల సమానత్వం, స్వేచ్ఛా, హక్కులు అని అనేక మహిళా ఉద్యమాలు మాట్లాడుతున్నాయి స్త్రీ సమస్యలు అన్నీ పురుష జాతి వలనే, పితృస్వామ్యం వలనే, ఆధిపత్య భావజలం వలనే అని మాట్లాడుతుంటారు కానీ ఇది వాస్తవం కాదు. మాతృస్వామ్యం- పితృస్వామ్యాలనేవి సంతానోత్పత్తి కోసం శ్రమ విభజన యొక్క ప్రాథమిక రూపాలు, అలాగే పరివర్తనాత్మక ఉత్పత్తి సంబంధాల వ్యవస్థగా పరిగణించాలి. వ్యవసాయం విస్తృతమవ్వడం, జీవనోత్పత్తి అదనపు ఉత్పత్తిగా మారడంతో దంపతీ వివాహాలు, రాజ్య ఆవిర్భావం మొదలైనవి ఏర్పడ్డాయి.

స్త్రీ పురుషుల మధ్య వైరుధ్యం అనేది "స్త్రీ పురుషుల సఖ్యత ఫలితంగా చరిత్రలో దంపతీ వివాహం పుట్టుక రాలేదు. అసలు అలాంటి సఖ్యతకు అది ఉన్నత రూపం కూడా కాదు. తద్విరుద్ధంగా స్త్రీ జాతిని పురుషుడు తన ఆధీనంలోకి తెచ్చుకొనడంతో అది వచ్చింది. ఆదిమ కాలంలో స్త్రీ పురుషుల మధ్య ఎన్నడూ కనిపించని ఘర్షణ దానిలో ఉంది... స్త్రీ పురుషుల మధ్య ప్రప్రథమంగా జరిగిన శ్రమవిభజన సంతానోత్పత్తి కోసం. దానికీ నాడు ~~ఈ~~ వాఖ్యాన్ని కూడా చేరుస్తాను. చరిత్రలో మొట్టమొదటి సారిగా కనిపించే వర్గవైషమ్యం, దంపతీ వివాహంలో స్త్రీ పురుషుల మధ్య తలెత్తిన వైషమ్యం ఏక కాలంలో సంభవించాయి....దంపతీ వివాహం

మహత్తరమైన చారిత్రక అభివృద్ధి అయితే అదే సమయంలో అది బానిసత్వం, సొంత ఆస్తితో కలిసి ఆవిర్భవించింది..... దంపతీ వివాహం అనేది నాగరికతకు సూక్ష్మ రూపం. సమాజంలో కనిపించే వైషమ్యాలు, వైరుధ్యాలు మనకి ఇందులో కూడా కనిపిస్తాయి.''-ఏంగెల్స్

కావున స్త్రీ పురుషుల మధ్య వైషమ్యం దంపతీ వివాహంలో అని గ్రహించాలి అంతేకాని ఆదిమ రూపమైన పితృస్వామ్యం అనేది సంతానోత్పత్తి కోసం జరిగిన శ్రమ విభజనగా గ్రహించాలి అంతేకానీ అది ఎప్పటికీ, ఎల్లవేళలా స్త్రీపై దోపిడీ చేసే అంశంగా చూడకూడదు. కాబట్టి స్త్రీ సంపూర్ణ సమానత్వం, స్వేచ్ఛను సాధించాలన్నా ఈ రోజువరకూ జరుగుతున్న దాడులను, అరాచకాలను ఆపాలన్నా కార్మిక వర్గానికి పెట్టుబడిదారీ వర్గానికి మధ్య ఉన్న వర్గ వైరుధ్యం నిర్మూలనకై పోరాటం చేయడం ద్వారా వర్గ వైరుధ్యంలో భాగంగా ఉన్న శ్రమ దోపిడీ నిర్మూలనమవటం మాత్రమే కాక శ్రమ విభజన అనేది పోయి శ్రమ దోపిడీ విముక్తి జరుగుతుంది. అప్పుడు మాత్రమే స్త్రీ సంపూర్ణమైన సమానత్వమును స్వేచ్ఛను పొందుతుంది. దీనితో ఏక కాలంలో సంభవించిన వర్గ వైషమ్యం దంపతీ వివాహంలో స్త్రీ పురుషుల మధ్య తలెత్తిన వైషమ్యం పరిష్కరించబడుతుంది. ఫలితంగా "ఈనాటి కుటుంబం అనగా బూర్జువా కుటుంబం ఏ పునాదుల మీద నిలబడి ఉంది? పెట్టుబడి మీద, వ్యక్తిగత లాభం మీద ఉంది. ఈ కుటుంబం పరిపూర్ణ రూపం బూర్జువాలలో మాత్రమే ఉంది. కానీ ఈ స్థితికి అనుబంధంగా రెండు అంశాలు ఉన్నాయి. కార్మికుల్లో

కుటుంబం అనేది ఆచరణలో లేకపోవడం, బహిరంగంగా సాగే సానివృత్తి. బూర్జువా కుటుంబం యొక్క ఈ అనుబంధ అంశాలు అంతరించినప్పుడు బూర్జువా కుటుంబం దానంతట అదే అంతరిస్తుంది, పెట్టుబడి అంతరించినప్పుడు రెండూ అంతరిస్తాయి."
- కార్ల్ మార్క్స్, ఏంగెల్స్

అయితే కమ్యూనిస్టులు స్త్రీలు కేవలం ఉత్పత్తి సాధనాలుగా ఉండే స్థితిని రద్దుచేయడం జరుగుతుంది. దీనితో "బూర్జువా వివాహ వ్యవస్థే నిజానికి సమిష్టి పెండ్లాల వ్యవస్థ. కాబట్టి కమ్యూనిస్టుల మీద బూర్జువాలు నిందవేయదలుచుకుంటే, మహా అయితే బూర్జువాలు ప్రచ్ఛన్నంగా సాగించే కపట నాటకాన్ని కమ్యూనిస్టులు బహిరంగంగా చట్టబద్ధంగా చేస్తారని మాత్రమే నిందవేయగలరు. ఇక చెప్పవలసినదేమిటంటే ప్రస్తుత ఉత్పత్తి వ్యవస్థ రద్దు కావడంతోనే ఇందులోనుండి ఉత్పన్నమైన సమిష్టి భార్యల వ్యవస్థ కూడా అనగా బహిరంగ వేశ్య వృత్తి, ప్రచ్ఛన్న వేశ్య వృత్తి రద్దు అవుతుందనేది స్పష్టంగా తెలుస్తూనేవుంది." - కార్ల్ మార్క్స్, ఏంగెల్స్

ఐతే ఈనాటికీ మరీ ముఖ్యంగా తెలుగు రాష్ట్రాల్లో మహిళా ఉద్యమాలు సంపూర్ణ బూర్జువవాద ఫెమినిస్టు ధోరణితో కొట్టుమిట్టులాడుతున్నాయి. అరిగిపోయిన పితృస్వామ్య రికార్డుతో అసలు వైరుధ్యాన్ని కప్పిపుచ్చి మసిపూసిన మారేడుకాయ ఉద్యమాలను అభివృద్ధి చేస్తూ తప్పుడు చైతన్యపు మహిళా ఉద్యమాలు

రాజ్యమేలుతున్నాయి ఫలితంగా నేడు శ్రమశక్తి దోపిడీ, దంపతీ వివాహపు వైరుధ్యానికి వ్యతిరేకంగా పోరాడటమే కాక ఈ తప్పుడు చైతన్యపు మహిళా ఉద్యమాలకు వ్యతిరేకంగా పోరాడాలి. అందుకై సంఘటితమవ్వాల్సిన సందర్భం ఆవశ్యకం.

## ఎల్.జి.బి.టి.క్యూపై శాస్త్రీయ అవగాహన:

మానవ సమాజం అనివార్యంగా ప్రకృతి-సామాజిక సంబంధాలపై ఆధారపడి సాగుతుంది. అయితే మానవుడు ప్రకృతి నుండి విడివడి ముందుకు సాగడం మనందరికీ తెలిసిన విషయమే కదా. ఈ ప్రకృతి అనేది మానవీకరించబడిన ప్రకృతిగా పరిణామం చెందుతుందని మనం అవగాహన చేసుకోవాలి. అలాగే మానవీకృత సామాజికుడిగా మానవుడిని గ్రహించాలి కూడా. ఇకపోతే మానవుడు అనివార్యంగా అనువంశికత మరియు పరిసరానువర్తనం అనే వైరుధ్యంలో భాగంగా సహజ ప్రతిచర్యలను మరియూ ఆర్జిత ప్రతి చర్యలను పొందుతూ సాగుతారు. అంటే అనువంశికత అనేది పరిసరానువర్తనం ద్వారా మార్పు చెందుతూ పరిసరానువర్తనం అనువంశికతగా అలాగే ఈ అనువంశికత కొత్త పరిసరానువర్తనం ద్వారా మార్పు చెందుతూ సాగుతుంది. ఇదొక వైరుధ్యంగా సాగడమే మనం ముఖ్యంగా భావించాలి. కావున మానవ సమాజపు చారిత్రక పరిణామ క్రమంలో జరిగే మార్పులలో ముఖ్యంగా అనువంశికత నుండి పరిసరానువర్తనం మరియు పరిసరానువర్తనం నుండి

అనువంశికతకు మార్పులో ఎల్.జీ.బి.టి.క్యూ అనే సమస్య ఉద్భవించడం జరుగుతుంది. అదొక జీవశాస్త్రం సమస్యగా ఉంటుంది. అయితే సామాజిక సమస్యగా కూడా దీన్ని చూడటమే దానికున్న అన్ని పార్శ్వాలను పట్టుకోవడంలో కీలకంగా ఉంటుంది కూడా. కావున సామాజిక సమస్యలో జనాభా నిష్పత్తి సమస్యను కూడా పరిగణించడం ఒక ఆనవాయితి అంటే స్త్రీ-పురుష జనాభా సంఖ్యలో వచ్చే ఎగుడు దిగుడులను బట్టి స్వలింగ సంపర్కం ప్రారంభమైనదని అవగాహన అనగా ఇది నాగరిక సమాజానికే కాకుండా అనాగరిక మరియు ఆదిమ సమాజాల్లో సైతం ఈ నేపథ్యంలో ముందుకు వచ్చింది. అలాగే బానిస సమాజాల్లో బానిసలను నిర్భందించినప్పుడు సైతం ఒక సమస్యగా ముందుకు వచ్చింది. అయితే ఈ బానిస యాజమాన్యాలకు ఈ అలవాటు పర్యావరణ మరియు అధికోత్పత్తి కార్యక్రమం ద్వారా ఏర్పడిన లింగ నిష్పత్తిలో ఎగుడుదిగుడుల మూలంగా కొనసాగుతూ వచ్చింది కూడా. అలాగే శరీరంపై సరైన అవగాహన లేని సమయంలో సైతం ఈ సమస్య ముందుకు వచ్చిన దాఖలాలు ఉన్నాయి కూడా ఏమైనా ఉత్పత్తి మరియు పునరుత్పత్తి మధ్య వైరుధ్యాన్ని సైతం అవగాహన చేసుకోవడం ద్వారా ఈ సమస్యకు పరిష్కారం దొరుకుతుంది.

బూర్జువా కుటుంబ వాదాలు- పెటీబూర్జువా కుటుంబ వాదాలు అలాగే సోషల్ డెమోక్రటిక్ కుటుంబ వాదాలకు వ్యతిరేకంగా

మనం అలుపెరగని పోరాటం చెయ్యాల్సిన సమయంలో ఉన్నాము. అలాగే ఎల్.జి.బి.టి.క్యూ యొక్క సామాజిక సమస్య పునాదిగా సాగే అస్తిత్వవాదాన్ని క్షుణ్ణంగా ఎదురుకోవాల్సిన అవసరం ఉన్నది. ఈ అన్యవర్గ ధోరణలను మనం సాంస్కృతిక పోరాటం ద్వారా ఉద్ధృతం చెయ్యాల్సిన అవసరం ఉన్నది. ఇటీవల ఈ అన్యవర్గ ధోరణలతో భ్రష్టుపట్టామని అవగాహన చేసుకోవాలి.

**అశ్లీల చిత్రాలకు వ్యతిరేకంగా పోరాడుదాం:**

మానవ సమాజంలోని సామాజిక అధ్యాసల ప్రతిఫలంగా వ్యక్తిగత అధ్యాసలు కలుగుతుంటాయి (భావజాలం). ఈ అధ్యాసలు పూర్తిగా రాజకీయార్థిక అంశాలతో ముడిపడియుంటాయని గమనించాలి. సంతానోత్పత్తి క్రియ- సుఖమనే అంశాల మధ్య వైషమ్యం ఏర్పడుతుంది (సామాజిక వైరుధ్యం నుండి ఉద్భవిస్తుంది), ఫలితంగా సంతానోత్పత్తి క్రియ యొక్క సద్గుణపు సర్వోత్కృష్ట రూపంగా సుఖాన్ని గుర్తించడం జరుగుతుంది. సుఖమే అత్యుత్తమమని చలామణి అవుతుంది. ఫలితంగా ఈ సుఖానికి ప్రతిరూపంగా వ్యభిచారం (ప్రత్యక్ష-పరోక్ష) అలాగే అశ్లీల చిత్రాల వీక్షణంగా (అభూత వ్యభిచారం) ఉద్భవిస్తాయి(గత కుటుంబ రూపాలు రూపాంతర (అఫేబెన్ లేదా అఫేబంగ్) పద్ధతిలో వర్తమానంలో వ్యక్తం కావడంగా-వ్యవహరించే నూతన రూపాలుగా వీటిని గ్రహించాలి). అశ్లీల చిత్రాల వీక్షణంతో డోపమైన్ అనే రసాయనం విడుదల అవుతుంది. ఈ రసాయనం

అనేది ఒక సుఖ రసాయనంగా మన శరీరంపై ప్రభావం చూపుతుంది, అంతేకాకుండా ఈ రసాయనం సుఖ వ్యసనానికి గురిచేస్తుందని, కావున అశ్లీల చిత్రాల వీక్షణం ఒక మత్తు మందని శాస్త్రీయ అధ్యాయనాలు వెల్లడి చేస్తున్నాయి. కావున ఇది మన సమాజం తక్షణం ఎదురుకుంటున్న సమస్యాత్మక వ్యవహారంగా ఉన్నది, కనుక పరిష్కరించకపోయినా తదనుగుణంగా ఆలోచించకపోయినా మనకూ అంటుకునే సమస్య (విభిన్న రూపాలలో). ఈ సమస్యకు పరిష్కారం (తాత్కాలికమే అనుకోండి) రెండు పార్శ్వాలల్లో సాగాలి ఒకటి జ్ఞాన సంబంధితం, రెండు ప్రభుత్వ నియంత్రణా చర్యలు. ప్రజలను ముఖ్యంగా విద్యార్థి, యువకులను ఈ సమస్య పై జ్ఞానవంతులను చేయడం కొరకు ప్రభుత్వం మరియు పౌరప్రజా సంఘాలు అధ్యాయణ తరగతులు, చైతన్య కార్యక్రమాలు నిర్వహించాలి. రెండు ప్రభుత్వం వాస్తవ-పరోక్ష-అభూత వ్యభిచారాలను కట్టడి చేయాలి (నిజానికి ఇప్పటి వ్యవస్థ నిర్మూలనతోనే ఇది సాధ్యపడుతుంది). అందులో భాగంగా అశ్లీల చిత్రాలను నియంత్రించాలి, వీటి నిర్వాహకులపై క్రిమినల్ కేసులు వెయ్యడమే కాకుండా ప్రత్యేక దర్యాప్తు సంస్థలను ఏర్పర్చాలి. వ్యభిచార వృత్తి నుండి బయటకు వచ్చిన వారికి సామాజిక భద్రత మరియు ఉద్యోగాలు కల్పించాలి, మొదలైన పరిష్కారాలను పౌరప్రజా సంఘాలు - ప్రభుత్వాల ఉమ్మడి అవగాహనతో కూడిన దీర్ఘకాలిక కార్యాచరణతో సాగడానికి ప్రయత్నం ప్రారంభమవ్వాలి. అయితే ఉత్పత్తి-పునరుత్పత్తి అనే ద్విముఖ అంశాల మధ్య వైరుధ్యాన్ని

పరిష్కరించనంత వరకూ వ్యక్తిలో అరాచకత్వం చోటుచేసుకోకుండా ఉండదని గ్రహించాల్సిందే. అందుకు సామాజిక మార్పు యొక్క అవసరం ఉన్నది, అందుకోసం పరిష్కారం వెతకవల్సిందే.

భ్రష్టత్వ సిద్ధాంతాలకు లోనైపోయి కేవలం మనల్ని మనం ఒక పరిమితపరమైన అవగాహనతో కుదించుకుని పరిమితపరమైన వాదులుగా లేదా కేవలం స్వార్థపర దృష్టితో చింతించే వాగ్గేయకారులుగా సాగిపోయే మహా ఋషీశ్వరులుగా సాగిపోతూ మనం చేసే ఘనకార్యాలు ఓ అద్భుత వాదాలుగా చలామణి అవ్వడం ఒక చారిత్రక పతనం. ఈ దుష్టత్వాన్ని కేవలం పడికట్టు బ్యూరోక్రటిక్ పదాలతో ఖండిస్తూ చలామని అయ్యే రోజులు పోవాలని నేడు మనం ఒక ఉద్యమాన్ని నిర్వహించాల్సిన కర్తవ్యం ఉన్నది.

**రాజకీయాధికారం హస్తగతం-ప్రజా ఉద్యమం:**

రాజకీయాధికారం హస్తగతం అనే అంశాన్ని ప్రజా ఉద్యమాలపై ప్రతిష్టించడం కీలకమైన అంశంగా నేడు ఉన్నది. ఈ రోజు రాజకీయాధికార హస్తగత రాజకీయాలు ప్రజా ఉద్యమాలపై లేకపోగా ఇదంతా వాదించే, ఆచరించే వారంతా కేవలం సాహస కార్యాలపై ఆధారపడే లక్షణాలు గల వారని దుందుడుకు వాదులనే నిందని ఎదురుకుంటున్నారు. ఐతే ఆయా వర్గ ఉద్యమాలు-పోరాటాల విభిన్న దశల్లో ఈ రాజకీయాధికారం హస్తగతాన్ని ప్రతిష్టించవచ్చు. అంతేకానీ రాజకీయాధికార హస్తగతం అనే దశ వేరనే వాదన

రివిజనిజమే. అందుకే విభిన్న వర్గపోరాటాల దశలల్లో సైతం రాజకీయాధికార హస్తగతం రాజకీయాలని ప్రతిష్టించి ఆ దిశగా ఉద్యమాలని నడిపించడం జరగాలి. ఈ మౌళికాంశాన్ని నిర్లక్ష్యం చేసి నాశనం వైపుకు పరుగులు తీసింది ప్రజా ఉద్యమం. అందుకే విప్లవ రాజకీయాధికార లక్ష్యం ప్రధానమైనది.

## స్వతంత్ర రాజకీయ కార్యాచరణ-ప్రజా ఉద్యమం:

రాజకీయాధికార హస్తగతపు రాజకీయాల స్వభావం విభిన్న రాజకీయ కార్యచరణలతో విభేదిస్తూ మార్క్సిస్టు-లెనినిస్టు-మావోయిస్టు దృక్పథంతో కూడిన స్వతంత్ర రాజకీయ కార్యాచరణని ఏర్పర్చి సాధింపచేయడం కీలకమైన అవసరం (దీనినే రాజకీయాధికార సన్నద్దతగా చెప్పుకోవాలి). అయితే ఈ స్వతంత్ర రాజకీయ కార్యాచరణ స్థానంలో కేవలం వివిధ బూర్జువా-పెటీ బూర్జువా వర్గాల ఐక్యసంఘటనలకు ప్రాకులాడటమే ఉద్యమ కర్తవ్యంగా అదే ఉద్యమ స్ఫూర్తిగా మారిపోయిన సందర్భాన్ని గమనించవచ్చు. నిజమైన ఐక్యసంఘటన అనేది వ్యూహాత్మక పంథాతో ముడిపడిన స్వతంత్ర రాజకీయ కార్యాచరణ మరియు నిర్మాణాలే ఉద్యమాలని ముఖ్యంగా కార్మిక-కర్షక ఐక్యతలని ఏర్పరుస్తుంది.

## ఎన్నికల బహిష్కరణ-ప్రజా ఉద్యమం:

ఎన్నికల బహిష్కరణ అనే అంశాన్ని ఈ రోజు ప్రజా సంఘాలు ఏ స్థాయిలో ఉన్నా ప్రధాన రాజకీయ నినాదంగా, కార్యాచరణ

మరియు అదే విధంగా ప్రచారాన్ని ముందుకు తీసుకువెళ్ళే కర్తవ్యాన్ని కలిగియుండాలి. ఈ విధంగా ఎన్నికల బహిష్కరణ నినాదం అనేది ఒక తీవ్రమైన మరియు ముఖ్యమైన వ్యవహారంగా కమ్యూనిస్టు ఉద్యమం పరిగణించాలి. విప్లవ పార్టీ యొక్క వ్యూహాత్మక ఆచరణ అనేది ఎన్నికల బహిష్కరణతో ముడిపడి ఉన్నట్లే ప్రజా ఉద్యమాలు-ప్రజా సంఘాలు ఎన్నికల బహిష్కరణ యొక్క వ్యూహాత్మక-ఎత్తుగడలతో ముడిపడిన కార్యాచరణను ముందుకు తీసుకుపోవాలి. అందుకే ఎన్నికల బహిష్కరణ అనేది రాజకీయాధికార హస్తగతానికి సంబంధించిన కీలకమైన వ్యూహాత్మక అంశంగా ఉంటుంది. ఈ ఎన్నికల బహిష్కరణ సైతం ఉద్యమం ఏ స్థాయిలో ఉన్నా ఆయా వర్గ చైతన్య స్థాయిలపై సైతం ప్రతిష్టించగల సామాజిక పునాది కలిగిన అంశంగా ఉంటుంది. అందుకే నేడు ప్రజా సంఘాలు ఆయా వర్గ పోరాటాలపై ఈ నినాదాన్ని ప్రతిష్టించి ఆచరించే కర్తవ్యాన్ని కలిగియుండాలి. అంతేకానీ ఆర్థికవాదపు కోరల్లో ఇరుక్కుపోయి అదే మొత్తం ఉద్యమంగా మలచడమనేది రివిజనిజంగా చూడాలి.

## ఇప్పటి దాకా ప్రచురితమైన రచయిత రచనలు

**1.** మార్క్సిస్టు తత్వశాస్త్రం
(స్టడీ నోట్స్)
రచయిత: అంకాళ్ళ పృథ్వి రాజ్
ప్రచురణ కాలం: 2016

**2.** మార్క్సిజం అజేయం
(వ్యాసాలు)
రచయిత: అంకాళ్ళ పృథ్వి రాజ్
ప్రచురణ కాలం: 2018

**3.** బృందావనం
(దీర్ఘ కవిత్వం)
రచయిత: అంకాళ్ళ పృథ్వి రాజ్
ప్రచురణ కాలం: 2019

**4.** సత్యపథం
(వ్యాసాలు)
రచయిత: అంకాళ్ళ పృథ్వి రాజ్
ప్రచురణ కాలం: 2020

5.' రివేరాస్' ఆబ్జెక్టివిటి:
(రివేరా కవిత్వంపై తాత్త్విక పరామర్శ)
రచయిత: అంకాళ్ళ పృథ్వి రాజ్
ప్రచురణ కాలం: 2021

6. వెన్నెల రాత్రులు:
మోహ గీతం
రచయిత: అంకాళ్ళ పృథ్వి రాజ్
ప్రచురణ కాలం: 2022